## "సరస్వతి" 

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

నటరాజూ పలుకుతల్లీ, కూడి కులుకగల ప్రదేశం పానుగంటివారి బుద్ధి, వారి లేఖినిలో నవ్వులపువ్వులు జాలువారుతై. ఈ సరస్వతీనామక నాటకరాజం సరస్వతీదేవికో చక్కని కానుక. షేక్స్పియర్ కామెడి ఆఫ్ ఎర్రర్సు' అనేనాటకం వ్రాసి ఖ్యాతిగడించాడు. అదేవిధమైన గాథను అంతచక్కగా సృష్టించి పానుగంటివారు అమృతత్వం పొందారు. కొన్ని గృహచ్ఛిద్రాలవల్ల అన్నా చెల్లెలూ ఇల్లు వదలి వెళ్ళారు. అన్నకు ఆడవేషం, చెల్లికిమగవేషం దాంతో సిద్ధించినై. స్త్రీ వేషంలో వున్న అన్నను చూచి ఓ రాచకుమారుడు వరించాడు. పురుషవేషంలో వున్న చెల్లిని చూచి ఓరాచకుమారి మోహించింది. ఆనాటకం నడపడం లోనే వుంది కవిగారి సిద్ధహస్తం.

మగవేషంలోవున్న అమ్మాయిని రాజకుమారి పెళ్ళిచేసుకోమని తొందరచేస్తుంది. అప్పు డతడు తనలో

> మూగమూగతోడ ముచ్చటాడినయప్పు, డంధు డంధుగాంచి యలరునపుడు
> కవికిఁ గవికి మనసు కలసినయప్పుడు, నాకు నీకు గంకణాల సాగను.

అంటాడు.

ఆడవేషంలో వున్న అన్నగారిలా వాపోతాడు.

> "దొంగవైనను సన్యాసి లుంగి దాల్ప, భిక్షమిడువార లెందరో వెలయుచుండ్రు
> పురుషుడైనను స్త్రీరూపమునను దిరుగ, ముద్దులిచ్చెడి మగలకు హద్దుకలదె"

ఈవిధంగానడిచింది. ఈనాటకంచదవటంలో నేసరసంవుంది. అర్థంచేసు కోవడంలోనే ఆనందం వుంది. వెల 1-4-0.

## "తెనుఁగుతల్లి"

వేదాంతకవి ప్రణీతము.

వేదాంతకవిగారి కలంలోంచి వెలువడిన రక్తంగాని, పరిపోషించదా,అని పిస్తుంది. పేదరికాన్నిరూపుమాపటానికీ తెనుగుతనాన్ని నిలబెట్టడానికి వారిమనస్సు పరువులు తీస్తుంది. ఆంధ్రభారతిపడేఅగచాట్లు యీ కవిగారి హృదయాన్ని కరగించి యీనాటకాన్ని సృష్టించినై. ధన మదాంధుల దౌష్ట్యం, కవీంద్రులకన్నీరూ, విశ్వదాతల ఆదరాభిమానాలూ, పునాదులుగా గలయీనాటకం ఆంధ్రదేశంలో అన్నిచోట్ల ఆడబడ్డదే. ఆబాలగోపాలంచేతా అభిమానింపబడ్డదే, కదంతొక్కే కవిత్వం కావాలనుకున్నవారూ, పైడిముక్కలవంటి భావాలు కావాలనుకున్నవారూ చదివి తీరాల్సినదే. వెల 1 4 0 మాత్రము.

వలయువారు:—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

# సీక్రెట్ లవర్

(రహస్య సిరీయసు)

రచయిత:

## శ్రీ కొప్పర్తి లక్ష్మీనరసింహారావుగారు



ప్రకాశకులు:

## కురుకూరి సుబ్బారావు & సన్స్

ప్రొప్రైటర్సు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.



[వెల 6 అణాలు

మొదటి కూర్పు. 1500.

స్వభాను. ఆశ్వీజ



## సూచన :

"చెరుపకురా, చెడేవు—"

అన్నసూక్తి అక్షరాలా యథార్థం!

ఆమెలో చెలరేగిన అసూయాజ్వాలలు, ఆమెనే దహించివేశాయి.

తనడబ్బుకాసించి, తన్ను ద్వితీయభార్యగా వివాహమాడిన అమాయకుడి, తొలిభార్యను అంతమొందించి, అతనిని మోసం చేయ బోయిన ఒకానొక వంచకురాలు తాను తవ్వుకొన్న గోతిలో తానే దిగింది—

ఇటువంటివి నిలకడమీద తేలే నిజాలు!

ఇట్లు,
రచయిత

స్వకీయ సరస్వతీ ప్రెస్
బెజవాడ

అక్టోబరు
1943

౧

"అదేమిటి రాధమ్మ పిన్నీ! నన్ను మరచిపోయావా? నేను చచ్చి పోలేదరా! ఇదేం విడ్డూరం?"

"నువ్వు విమల వంటుంటే, నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. విమల చచ్చిపోయి ఏనాడయిందీ?"

"చాల్లే పిన్నీ! నేను విమలనుగానా, నీ కింకా గుర్తు లేకుండా పోయిందా?"

"ఇదేదో మహా మాయలా వుంది—నే నర్థం చేసుకోలేకుండా వున్నాను. విమల ఖూనీ చెయ్యబడి, ఇప్పటికి దగ్గర దగ్గర పదావి కావస్తూంది. కేసుకూడా జరుగుతూవుంది. నువ్విప్పుడు ఆ విమల నే నంటూ వస్తే యెవరు నమ్ముతారు? అయితే నువ్వు విశాలవై యుండొచ్చు."

"విశాల నాచెల్లెలు—అయ్యో! నీ కింత జ్ఞాపకశక్తి లేకుండా పోయిందేం?"

"విమల చెల్లెలు విశాల. ఇద్దరూ ఒకే పోలికలో వుండేవారు. అందుచేత గుర్తుపట్ట లేకుండా వున్నాను. అయితే నువ్వు విమల నంటు న్నావా? మరి ఆఖూనీ కేసేమిటీ?"

"అంతా ఒట్టిదే పిన్నీ! నేను ఖూనీ చెయ్యబడ్డానని, నాభర్తను కిట్టనివాళ్లు పుకారు వేశారు."!

"సరే—నువ్వు విమలవయితే విశాల ఏమయిందీ?"

"నాలుగయిదు సంవత్సరాలనుంచి దాని జాడా, జవాబూ ఏమీ తెలియడంలేదు. ఎక్కడి డోర్నకల్లు—ఎక్కడి యానం. అందు చేత దాని క్షేమసమాచారము బొత్తిగా తెలియకుండా పోయింది. ఆమధ్య నేనే దానిపేర ఒక వుత్తరము రాశాను. జవాబు లేక పోవడం వల్ల, తిరిగి దాని స్నేహితురాలిపేర డోర్నకల్ ఉత్తరం రాస్తే, అది భర్త పోగానే ఎవరితోనో పరారి అయిపోయిందని ఉత్తరం రాసింది. చెల్లెలు విశాలకోసం ఒక యేడు పేడిచి వూరుకోవడంకంటే, యింకేమి చెయ్యగలను పిన్నీ—"

"నువ్వు విమలవంటే, నా కెంతమాత్రమూ నమ్మకం కలగడం లేదు. నువ్వింకా విశాలవనే నా వుద్దేశ్యం. అయినా, మీ బాబయ్య గారు వస్తారుగా. సామానులు వగైరాలు ఇంట్లో పెట్టించు-కూర్చో."

"బాబయ్య ఎక్కడకు వెళ్లాడు?"

"అలా వీధిలోకి వెళ్లారు. వస్తారు. ఈ కేసు వచ్చినప్పటినుంచీ ఆయన కసలే మనస్థిమిత ముండడం లేదు. పోలీసులు ఆయనను కూర్చో నీయకుండా, నిలుచో నీయకుండా ప్రాణాలు తీస్తున్నారు."

"అవును. చాలా ఘోరం జరిగిందట. నే నామధ్య ఆరుమాసాలు నర్సు ట్రయినింగు కోసం మదరాసు వెడితే, ఆసమయంలో, నన్ను నాభర్త హత్యచేసి, మరోపెళ్లి చేసుకున్నాడని వదంతి వేశారు, దానితో సి. ఐ. డి.లు బయలు దేరారు—కూపీలు లాగుతున్నారట. ఈసంగతి తెలియగానే, నేను మదరాసునుంచి చక్కా వచ్చేశాను."

"నీభర్త యెక్కడున్నాడు?"

"ఆయన పట్నంలోనే వున్నారు!"

"అతను తిరిగి పెళ్ళిచేసుకోడంమాట నిజమేనా?"

"నన్ను ద్రోహం చేసే వుద్దేశంతో వారు పెళ్ళిచేసుకోలేదు. చాలా గొప్పస్థితిమంతురాలుగదా అని వా రామెను తిరిగి వివాహం చేసుకొన్నారు."

"విమల హత్య చెయ్యబడలేదూ?"

"నేను మొహంగుండా నిలుచుని మాటలాడుతో వుంటే హత్య చెయ్యబడ్డానంటా వేమిటి?" అని హత్యచేయబడిన విమల తానే నని చెప్పుకొంటూ వచ్చిన స్త్రీని రాధమ్మగారు అనేకసార్లు పరకాయించి చూసింది.

విమల విశాల లిద్దరూ రాధమ్మకు బావగారి పిల్లలు. వారికి చిన్నతనంలోనే తండ్రి పోయిన కారణంవల్ల పినతండ్రి అయిన వర్మ అన్నగారి పిల్లలిద్దరనూ కొంతకాలం పెంచాడు. వారికి తగిన సంబంధాలు రావడంవల్ల నయితేనేమి తాను పోషించడానికి శక్తి చాలడంవల్ల నయితే నేమి విమలకు పదేళ్లుండగానూ, విశాలకు ఎనిదేళ్లుండగానూ

పెళ్ళిళ్ళుచేసి వారి నత్త వారింటికి పంపేశాడు.

వారి పోషణాభారమును తప్పించుకోవడానికి వర్మ విమలను యానాం విశాలను డోర్నకల్ పంపేశాడు. వర్మయొక్క స్వగ్రామ మయిన విజయనగరానికి ఆ రెండు పట్టణాలూ దూరమే గనుక ఆపిల్లల క్షేమ సమాచారాలతనికి ఎక్కువగా తెలియడం లేదు. రెండూను మంచి కలిగిన సంబంధాలు గాబట్టి వారెక్కడో ఒకచోట సుఖంగా వున్నారనే తలంపుతో వర్మకూడా సరిపెట్టుకొని వూరుకొంటూ వున్నాడు. ఈ పదేళ్లూకూడా అలాగే గడచి పోయినాయి.

అంతా ఒక సంవత్సరం క్రితం మాత్రం వర్మకు, విమల, విశాలల విషయం విధిగా తెలుసుకోవలసి వచ్చింది. విమలను భర్త హత్య చేశాడనీ — అందునుగురించి కేసుకూడా నడుస్తూందని ఈమధ్య తెలిసింది.

తల్లిదండ్రులు లేని పిల్లల నతను కొంతకాలం పెంచాడు. పెళ్లి పేరంటాలు చేశాడు. వారెక్కడో సుఖంగా వుంటున్నారుగదా అనే తలంపుతో తృప్తిపడి వూరుకొంటున్నాడుకాని విమలను భర్త హత్య చేశాడన్న పిడుగువంటి వార్త తెలియగానే, అతను మితిలేని దుఃఖము ననుభవించాడు.

ఈ కేసులో పోలీసులకు సాయంచేసి, విమల భర్త అయిన కనకరాజును ప్రతీకారమును, చేయడానికే అతను కంకణం గట్టుకొన్నాడు. పెంచిన మమకారంవల్ల, రాధమ్మకున్నూడా కడుపు మండి పోయింది. కనకరాజు భార్యను హత్య చేశాడని తెలియగానే ఆ యిల్లాలు అతనిని వెయ్యివిధాల శపించింది.

వర్మకు రమారమి అరవై యేళ్ళొచ్చాయి. రాధమ్మకు నలభైకి తక్కువ లేవు. భార్యాభర్తల కిద్దరకూ కూడా పెద్దకాలం రావడం వల్ల, కొంచెం చూపుకూడా తగ్గింది. ఎంత దగ్గరగా వున్న మనిషి నయినా గొంతుకనుబట్టి ఆనవాలు పట్టవలసిందే గాని, రూపం కనబడదు.

ఇప్పుడింతకూ, తమ యింటికి వచ్చినది విమల అయినదీ లవిశా

అయినదీ, రాధమ్మ తెలుసుకోలేక పోవడానికి, చూపు తక్కువ ఒక కారణం—ఆమెను చూచి చిరకాలమై పోవడం, రెండవ కారణం.

"సంవత్సరం క్రితమే చచ్చిపోయినా వనుకొన్న దానవు, తిరిగి కళ్ళపడ్డావంటే, నాకు చాలా సంతోషంగానే వుంది గాని, విమలా! ఈవిషయాన్ని నమ్మలేకుండా వున్నాను."

అంటూ రాధమ్మ ఆమెను దగ్గరగా తీసికొని, శరీర మంతటా వాత్సల్యంతో తడమడం మొదలు పెట్టింది.

"నువ్వలా అంటే యిహనేం చెప్పను పిన్నీ! నాగొంతుక చూడు! నా రూపం చూడు! నా కళ్ళూ—వాలకమూ చూడు. నేను విమలను కాదంటావేమిటీ? నీ కింత అనుమానంగా వుంటే, బాబయ్య రానియ్యి, అతనే చెబుతాడు- నేను విమలను అవునో కాదో."

"ఆ! ఆయనగారి చూపు నాకంటే అధ్వాన్నంగా వుంది. ఆయనమాత్రం ఏం చెప్పగలరూ?"

"అయితే యిహ నేనేం చెయ్యాలో తెలియడం లేదు పిన్నీ! అయినా, ఒక్కవిషయం ఆలోచించు, మీ రందరూ అనుకొంటూ వున్నట్లు విమల హత్యచేయబడితే, నేనువచ్చి, ఆమెను నేనే అనిచెప్పుకోవడానికి కారణమేమిటి ? నేను విశాలనై వుంటే, మా అక్కయ్య హత్యను నేను మాత్రం సహించుకొంటానా? ఇంకో విషయం. ఏకారణంవల్ల నయినా నే నటువంటి మోసం జరిగించా లనుకొన్నప్పటికీ, అది చెల్లుతుందా? అయినా నేను విశాలనైవుండి, విమల నని చెప్పుకో వలసిన అవసర మేముందీ?" అని విమల తీవ్రంగా చెబుతూ వుంటే రాధమ్మ ఏమీ చెప్పలేకుండా వుంది.

"విమల నిజంగా హత్య చేయబడలేదు గాబోలు. ఆ కనక రాజు మీద గిట్టనివా ళ్లెవరయినా యిటువంటి అగావును పన్నారు గాబోలు. ఇది విమలేనేమో - నా కేమీ తెలియడంలేదు. ఆ యిద్దరప్పచెల్లెళ్లనూ కూడా చూసి చిరకాలమయింది. అందువల్ల ఎటూచెప్ప లేకుండా వున్నాను." అని రాధమ్మ తనలో తాను తర్కించుకొంటూ వున్న సమయంలో బయటకు వెళ్లిన వర్మ యింటికొచ్చాడు. వచ్చీరావ

ఉంలోనే తమ యింట్లోవున్న యువతిని చూసి, నిర్ఘాంత పోయినాడు.

"ఇదేమిటి విశాలా! నువ్వెప్పుడు వచ్చావు? అంతకాలంనుంచీ ఒక్క ఉత్తరం ముక్కయినా రాశావు కాదేం తల్లీ!" అని ఆశ్చర్య సంభ్రమాలతో అడిగాడు.

"అదేమిటి బాబాయ్! నీకూ అక్కలాగునే చూపానక పోవడం గొప్ప చిక్కే వచ్చింది. నేను విశాలనుగాను - విమలను."

"విమల—"

"అవును బాబాయ్! నేను విమలనే - బాగాచూడు. ముక్కద్దాలున్నాయేమో, వాటిని పెట్టుకు చూడు - తెలుస్తుంది."

"చాలు గాని, యిటువంటిపర్యాచకం మాటలు యిక మానెయ్యి. నా కెంతచూపు ఆనకపోయినా, యింకా అంతచేటు గుడ్డితనం రాలేదు. విమలను దాని మొగుడు హత్యచేసి, దుమ్ములో కలపి యేనాడయిందీ? ఇంకా కేసుకూడా మాపిపోలేదమ్మో. ఇటువంటి సందర్భంలో నువ్వు విమలవని చెప్పుకొంటే యెవరు నమ్ముతారూ?

విమల రాధమ్మతో చెప్పినట్లే వర్మతోకూడా అనేక విధాల చెప్పింది. విశాలే తాను విమలనని తనతో పరిహాస మాడుతూందని వర్మ మొదట అనుకొన్నాడు. కాని ఆమెయొక్క తీవ్రవాదనను వినగా వినగా—అతనుకూడా ఆమె విమలా? విశాలా? అన్న సందేహంలో పడ్డాడు.

అప్పుడు అలమారులో నుంచి తన సులోచనాలు తీసుకొచ్చి కళ్లకు తగిలించుకొన్నాడు. ఆమెను పరీక్షించిచూచాడు. పరీక్షించి చూచాడు.

ఆమె విమలా? విశాలా?

అత నెటూ నిర్ధారణ చేయలేకపోయినాడు. అతని మెదడు పని చెయ్యడం మానేసింది.

"నువ్వు విశాలవు గావూ? విమల నంటున్నావా? అయితే ఈహత్య—ఈగొడవ అంతా వొట్టిదేనా? పోలీసులు ఇంత తెలివి తక్కువగా కేసు నడుపుతారా?"

సీక్రెట్ లవర్

"ఇదంతా నాభర్తకు కిట్టనివాళ్ళు చేసిన తంత్రం! బాబాయ్, విశాల వున్నట్లయితే నేను విమలనని మీకింతగా నచ్చ జెప్ప వలసిన అవసరం లేకపోయేది. దాని భర్త చనిపోవడమూ అది వెంటనే మరి యొకరిని తీసుకొని లేచిపోవడ, జాడా, జవాబూ లేకుండా అవడమూ; వచ్చిందిప్పుడు మీ అందరకూ ఇటువంటి సందేహం కలగడానికి— అయినా ఒక్క విషయ మాలోచించండి! నేను చనిపోయిన మా అక్కయ్యపేరు పెట్టుకొని యెందులకు వ్యవహరిస్తాను?" అని ఆమె చెప్పినమాటలవల్ల ఆమె విశాలేనని వర్మా రాధమ్మలు నమ్మకుండా వుండలేక పోయినారు.

"సాముద్రికం చెప్తామమ్మా! చేతిలో రేఖలు చూసి,ఉన్న దున్నట్లు చెప్తాం." అంటూ నడివయస్సులో వున్న ఒక బైరాగి ఆయింట్లోవున్న విమలను చూసి అంటున్నాడు. అమాటలను రాధమ్మ, వర్మలు కూడా విన్నారు.

"నా కేమీ చెప్పనవసరం లేదు, అవతలకు నడు." అని విమల గసిరేసింది. విమలను గురించి అత డేమి చెబుతాడో అని వర్మకు కుతూహాలంగా వుంది.

"పోయిం దేముంది? చెప్పించుకో విమలా!" అన్నా డతను.

"నాగీతలయొక్క ఫలితాలు నాకే తెలుసు. ఎవరూ చెప్ప నవసరంలేదు." అని విమల అన్నప్పటికీ, వర్మ కొంచెం సమ్మతిని సూచించడంవల్ల, ఆబైరాగి లోపలి సావిట్లో కొచ్చి, తిష్ఠవేశాడు.

"గురుబలం - దేవాబలం! కడుపున బుట్టిన రెండు కాయల్లోనూ ఒకటి కనుకాయిరాలి, దుమ్ములో కలసి పోయింది. బలనంతం చావు తెలియడం లేదా!" అని బైరాగి చెప్పడం ప్రారంభించే టప్పటికి, వర్మకి, రాధమ్మకి మితిలేని ఆశ్చర్యం కలిగింది. ఆమె మూతిముడుచు కొని, అక్కడనుంచి లేచి పోబోతూ వుంటే "ఉండమ్మాయీ! లేచి పోకు. వాడు చెప్ప దల్చుకొన్న దేమిటో పూర్తిగా చెప్పనియ్య!" అని వర్మ హెచ్చరించాడు.

"పిడిపిండం - వీడు చెప్పేదేముంది? విశాలగామా? ఎక్కడికో లేచి పోయింది. దాన్ని గురించి చెబుతున్నాడల్లే వుంది." అని విమల అనగా——

"జై సీతారాం! లేచిపోవడంగాదు బలవంతం చావంటే తెలవడంలేదా?" అని బైరాగి తిరిగి అన్నాడు.

"అయితే అది లేచి పోయిన కొన్నాళ్ళకు ఏనూతిలోనయినా పడి చచ్చి పోయుండేమో." అని విమల తిరిగి అంది.

"అలా చచ్చిపోయిన మనిషి ఈ అమ్మాయికంటే పెద్దదా? చిన్నదా? ఈ విషయం చెప్పండి మీ మాటలన్నీ నమ్ముతాము" అని రాఘమ్మ అనగా—

"ఏది చెయ్యాలన్నా మనసొకటి - అన్నీ చెప్తాం." అని బైరాగి అంటూ వుండగా——

"మీరేమయినా చెప్తున్నా యేమిటరా! ఈ బైరాగులు వట్టి దొంగముండాకొడుకులు, వీళ్ళను నమ్మకూడదు."

అంటూ విమల అక్కడనుంచి లేచి చక్కాపోయింది. రాఘమ్మ గోసెడు బియ్యం పట్టుకొచ్చి బైరాగికి వేసింది. "జై సీతారాం! భగవతీ!" అంటూ బైరాగి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

అటూ యిటూ చూసి, విమల అక్కడ లేకపోవడం వల్ల నర్మ భాస్కర అయినా నానమ్మతో యిలా అన్నాడు.

"అయితే యీ విషయం గురించి నీ అభిప్రాయ మేమిటి?"

"దీనివాలకమంతా చూస్తే, విశాలలా వుందిగాని, విమలలా లేదు."

"దానిమాటలు నాకూ నమ్మకం కలిగించ లేకుండా వున్నాయి. ఇప్పుడీ బైరాగి చెప్పే దానిగురించి, ఆమె కంత భయ మెందుకూ? అప్పగారు బలవన్మరణమును పొందినదని బైరాగి స్పష్టంగా చెప్పాడు. ఇంకేమి చెబుతాడోనని, దానికి భయంపుట్టి, లేచిపోయినట్లుగా తోస్తూంది."

"నిజమే—కాని, నా కొక్క సందేహం మాత్రముంది. కనక

రాజు నిజంగానే విమలను హత్యచేశా డనుకుందాం. అయితే, విశాల ఆవిమలను తానేనని చెప్పుకురావడానికి కారణమేమీ కనుపించదు."

"కనుపించని మాట నిజమే. దాని అప్పగారటువంటి దుర్మరణ మును పొందినందుకు ఈ చెల్లెలు మనకంటే యెక్కువగా విలపించ వలసివుంది. అందువల్ల, ఈమె విశాలకాదు—విమలేనని అనుకో వలసి వస్తూంది. అయితే యిదిక్కడికిప్పుడు యెందుకొచ్చావంటుంది?"

"మదరాసులో వున్నప్పుడు తాను చనిపోయినట్లుగా కిట్టనివాళ్లు ప్రచారము చెయ్యడము—మనలాంటి వాళ్లందరూ ఆ విషయము నమ్మడము, ఆమెకు తెలిసింది. అందుచేత బంధువు లందరకూ ఒక సారి కనుపించి, తాను చనిపోలేదన్న విషయమును పదిమందికీ తెలియపర్చడం ఆమె వుద్దేశ్యం."

'ఈమె విశాలా? విమలా? అన్న విషయమును మనం కూడా నిర్ధారణ చేయలేకుండా వున్నాము. అందుచేత ఈ విషయమును వెంటనే పోలీసులకు తెలియచేసి ఈమెను వాళ్లకు పట్టి యిచ్చినట్ల యితే వారే యధార్థవిషయమును తేలుస్తారుగా?"

"ఆపని మనం చెయ్యనక్కరలేదండి. రేపు కోర్టులో ఈమె యెలాగా హాజరవుతుంది. తాను విమల అయినట్లు ఋజువు చేసుకోనే భారం ఆమె మీదనే వుంటుంది." అని రాఘవమ్మ చెబుతున్న సమ యంలో విమల అక్కడ కొచ్చి—

"ఆబైరాగి వచ్చినాడు వెళ్ళిపోయినాడా?" అంటూ వీధిలోకి తొంగిచూసింది. ఆ బైరాగి ఆ అరుగుమీదనే ఒకమూలగా ఒదిగి కూర్చుని, తనమూలగా ముల్లె సర్దుకొంటున్నాడు.

"ఇదిగోనర్రా! వీ డింకా యిక్కడే వున్నాడు. వెళ్ళలేదు"

అని ఆమె ఆశ్చర్యంగా అనేటప్పటికి—

"ఎవరూ?" అని వర్మ అడిగాడు.

"వాడే! ఆ బైరాగి—యిందాకా మనయింటికి వచ్చిన వాడనుకో యింకా మన అరుగుమీదనే కూర్చున్నాడు."

అని విమల చెప్పగా, వా రతనిని చూడడానికి, యివతలకు వచ్చే

టప్పటికి కా బైరాగి, తనమూటా ముల్లే సర్దుకొని అక్కడనుంచి వెళ్లి పోతున్నాడు.

"ఆ బైరాగంటే, నీ కింత కోపంగా వుం దేందుకూ?" అని రాఘమ్మ అడగ్గా—

"ఈ బైరాగు లందరూ ఒట్టి దొంగముండాకొడుకులు—అందు చేతనే వీ ళ్లంటే నా కపరిమితమయిన కోపం."

ఆపయిన నన్మ రాఘమ్మ లిక నేమీ అనలేదు.

"ఈవేళ సాయంకాలం బండికి నేను వెళ్లిపోతాను, బాబాయ్.'

"ఎక్కడికి వెళ్లిపోతావు?"

"నేను చచ్చిపోయినా ననుకొంటూవున్న, మన బంధువుల అందరిళ్లకూ ఒకసారి వెళ్లి చూసి వస్తాను."

"సరే—నీయిష్టం."

"ఇలా చెయడంవల్ల, నేను హత్య చేయబడ లేదనిన్ని యధార్ధ విషయం అందరకూ తెలుస్తుంది—సంతోషం కలుగుతుంది."

"అవును - అలాగే చెయ్యి" అని అతడు తన మనసులోని అభి ప్రాయమును ఏమీ చెప్పకుండా అన్నాడు, విమల తిరిగి వీధిలోకి తొంగి చూసింది, ఆ బైరాగి యింకా వెళ్లి పోయినాడో, లేదో నని, అతనిని గురించి, ఆమె హృదయంలో పొందుతూవున్న ఆందోళనను వారు గమనించక పోలేదు.

అయినప్పటికీ, తను మనోభావాన్ని ఆమెకు తెలియపర్చలేదు.

ఇక వారి యింట్లో వుండటానికి కూడా ఆమెకు యిష్టం లేదు.

"రేపు కోర్టులో మీరు నన్ను గురించి ఏం చెబుతారు బాబాయ్!

"ఏమని చెప్పాలి?"

"విమల హత్యచేయబడ లేదనీ - నేనే విమలననీ, మీకు తెలిసిన యధార్థ విషయమును చెప్పినట్లయితే, నాథ ర్తపై మోపబడిన యీ నేరం తొలగి పోతుంది."

"నువ్వు విమల వన్న విషయమును మేమే యింకా నిర్ధారణ చేసుకోలేదు. విశాలవు నువ్వేనన్న అనుమానం మా కింకా పోలేదు."

"ఆ విషయాలన్నీ తరువాత ఆలోచించుకొని, మీ అను మానాన్ని పోగొట్టుకోవచ్చు. ప్రస్తుతం నేనే విమలనని సాక్ష్య మిచ్చి నాభర్తను రక్షించడం కర్తవ్యం"

"సరే - ఏదో చేదాములే" అనివారు అర్థాంగీ కారమును సూచించారు. విమల ఆసాయంకాలమే అక్కడ నుంచి, ప్రయాణమై బయలు దేరింది.

ఆమె వెళ్లిపోయిన అనంతరం, వర్మా, రాఘవమ్మ లావిషయ మును గురించి తమలో తాము అనేకవిధాల తర్కించు కొన్నారు. ఆమె విమలేనని కొంతసేపు - విశాల అని కొంతసేపూ అనుకోవడమే కాని, యిదమిత్థ మని తేల్చలేకపోయినారు. కోర్టులో ఆమెనుగురించి చెప్ప వలసి సప్పు డేమని చెప్పాలా అని వర్మ అనేక విధాలుగా ఆలోచించడం మొదలు పెట్టాడు కాని అతని కేమీ పాలుపోవడం లేదు. విమల అనిచెబితే ఒక పేచీ - విశాల అనిచెబితే ఒక పేచీ వచ్చే ట్లు అతనికి కనుపిస్తూంది.

## 3

కాళింది ముప్పయ్యేళ్లకు పైబడిన స్త్రీ. గొప్ప స్థితిమంతు రాలు. వితంతువయిన కారణంవల్ల స్వాతంత్ర్యగలరాలు. వయస్సు ముదురుదయినా, ఆమెకు తిరిగి వివాహం చేసుకోవాలన్న కోర్కె కలి గింది. వితంతువయిన కేసులో, సంతానం లేకపోవడం ఒకమేలు. అయితే ముప్ఫయికీ, నలభైకీ మధ్యవయస్సులో పున్నస్త్రీని వివాహం చేసుకొనే వరుడు దొరకడం కష్టమే. గర్భదరిద్రుడయినవాడు, కేవ లమూ డబ్బుకోసం ఆపని చెయ్యగలడు.

కనకరాజు- కాళిందికంటే చిన్నవాడే అయినప్పటికీ, నిరుద్యోగి యై మహాదరిద్రంవల్ల, మలమల మాడిపోతున్నాడు. ఆసమయంలో అతనికి కాళింది బంగారపుఖనిలా అవుపించింది. అందువల్ల భార్య వుండగానే, ఈమెను ద్వితీయభార్యగా వివాహం చేసుకొన్నాడు.

అయితే, స్థితిమంతురాలయిన తనయొక్క దాంపత్యసౌఖ్యంలో మరియొకరు భాగమును పంచుకోవడానికి, కాళింది అంగీకరించ లేదు.

మితిమీరిన ఆమె అసూయ, సవతిప్రాణాన్ని బలిగోరింది.

అందుచేత, అతని మొదటి భార్య అయిన విమల అడ్డులేకుండా చేస్తేనేగాని, తమయిద్దరకూ వివాహం పొసగదని, కాళింది ముందుగానే, కనకరాజుచేత ఖరారు చేయించుకొంది.

దురాశాపీడితుడయిన కనకరాజు, తనభావి సౌభాగ్యసంపదల కోసం తొలిభార్యను బలిదానమివ్వడానికి కంకణం గట్టుకున్నాడు. అదేప్రకారంగా ఒకనాడు విమలకు కాఫీలో విషము కలిపియిచ్చాడు. ఆమెశరీరమయినా ప్రజల కంటికిక్కనుపించకుండా, అర్ధరాత్రివేళ దహనచర్యలుకూడా చేయించాడు.

ఇదిజరిగిన రెండుమాసాలకు విమల భర్తచేత హత్యచేయబడింది అన్నవార్త ఎలా పొక్కిందో, ఊరంతా పొక్కింది. పోలీసులు - సి. ఐ. డి. లు కూపీతియ్యడానికి వివిధప్రయత్నాలూ చేస్తున్నారు. కాళింది చెప్పినమాటలను కనకరాజు అక్షరాలా నెరవేర్చాడు. అయితే, అంతవరకూ ఆమె అతనికి వీసమెత్తు ఆస్తిఅయినా ముట్టజెప్పలేదు సరిగదా, భార్యను హత్యచేశాడన్న కేసుమాత్రం నడుస్తూవుంది.

ఇందును గురించే, కనకరాజొకనాడు కాళిందితో యీవిధంగా ప్రస్తావించాడు—

"కాళిందీ! నీ ఆజ్ఞలను అక్షరాలా పాటించానుగదా! నువ్వన్న మాట నింకా నెరవేర్చావు గావేం?"

"ఏమి టదీ?"

"వివాహం అయినవెంటనే, నీ యావదాస్తినీ నాపేర వ్రాయడానికి గదా ఏర్పాటు?"

"దాని నిప్పుడు కాదన్నవా రెవరూ?"

"ఏదీ? అది జరిగినప్పుడు గదా!"

"పిచ్చివాడా! నా ఆస్తంతా నీదికాదూ? నిన్నుగాదని, నేను మాత్రం యింకెవరి కిస్తాను."

"నిజమేకాని, ఇప్పటికే సంవత్సరమై పోయింది. ఇంతవరకూ నీ కా ప్రయత్నమే వున్నట్లు కనబడదు."

"ఇదిగో-- మధ్యలో యీ వెధవ కేసు గొడవొకటొచ్చిపడింది. ఈ గొడవేదో పూర్తిగా తేలనియ్యి. ఆ తరువాత నే నెక్కడికి పోతాను? ను వ్వెక్కడికి పోతావు? ఆస్తి యెక్కడికి పోతుంది?" అని ఆమె చెప్పిన మాట లతని కెంతమాత్రమూ రుచించ లేదు.

"అలా అనడం న్యాయంగాదు. నేను గావించిన దెటువంటి సాహసమో నీకు వేరే చెప్పనక్కర లేదు. ఏపాపమూ యెరుగని అమాయకురాలు, నన్నే లోకంగా యెంచుకొని బ్రతికిన యిల్లాలు, అటువంటి భార్యను నీమాట విని, బలవన్మరణానికి గురిచేశాను.—"

"అంతా బాగానేవుంది. ఇప్పు డెవరు కాదన్నారు."

"నామాట నేను నెరవేర్చినప్పుడు, నీ మాటను నువ్వు నెరవేర్చ డం కర్తవ్యం కాదా?"

"అవును."

"అయితే యెందుకు చెయ్యవు?"

"ఈ కేసూ గందరగోళమూ తేలినతరువాత, నాసర్వస్వమూ నీ పేర రాసేయాలని నా వుద్దేశం."

"అంతవరకూ ఏమీా చెయ్యనన్నమాట?"

"మూడువాయిదాలలో కేసు టుప్పుమని యెగిరిపోతుంది. మీామరదలు విశాలను మనం కట్టుకొన్నాము. ఆమె మనచెప్పుచేతల్లో వుంది. విమల తానే నని, ఆమె మీాబంధువుల నందరనూ నమ్మించి రావడానికి వెళ్ళిందిగదా!"

"ఏమో, ఏమవుతుందో! మా పినమామగారూ వగైరాలు విమలను, విశాలను బాగా యెరుగుదురు. విశాల వెళ్ళి, నేనే విమలనని చెబితే, నమ్మేవా రెందరో, నమ్మని వా రెందరో."

"ఫరవా లేదు—నమ్ముతారు. ఆయిద్దర పోలికా ఒకేలాగున వుంటుంది."

"నమ్మితే నే నదృష్టవంతుణ్ణి, లేకపోయినట్లయితే, ఆ అమాయకురాలిని హత్యా చేసినందుకు తగిన ఫలితాన్ని అనుభవించి తీరతాను."

"ఇప్పుడా కేసును కొట్టివేయించాలనేగదా, నేను విశ్వ ప్రయత్నాలూ చేస్తున్నాను. ఎంతడబ్బు ఖర్చయినా సరే, వెను దియ్యను. ఒక్క విశాలకే అయిదువేల రూపాయలను ఈయడానికి నిర్ణయం.

"కేసు కొట్టేస్తే, ఖర్చుపెట్టిన సొమ్ము కంతటికీ విలువవుంది. లేక పోయినట్లయితే నేను ఉరిస్తంభ మెక్కవలసిందేగదా!"

"నీతోపాటు —— నేనుకూడా శిక్షను అనుభవించ వలసి వుంటుంది."

"నువ్వెందుకూ?"

"నిన్ను ప్రోత్సహించి, నేనే ఈ ఘాత చేసినట్లుగా ఋజువయిన నాడు, నాకన్నా శిక్ష తప్పదు. కాని ప్లీడర్లు ఈ కేసులో మనమే తప్పక నెగ్గుతామని చెబుతున్నారు. విశాల మనకు చేస్తున్న ఉప కారం అమోఘమని చెప్పాలి."

"అవును——అప్పగార్ని విషంపెట్టి చంపినందుకు, మనమీద కక్ష వహించక పోవడమేగాకుండా, ఆ విమలను తానేనని, ఘంటా పథంగా చాటుతూ, కేసులో మన కెక్కువ బలమును కలిగిస్తూంది."

"పోయిన అక్కగారు ఎలాగున రాదుగదా అనీ, తనకు వచ్చే అయిదువేల రూపాయలను వృథాగా పోగొట్టుకోవడ మెందుకనీ ఆమె ఇటువంటి సాహసమున కంగీకరించింది."

"ఈ సందర్భంలో మన మామెకు అయిదువేలు గాదు——పది వే లిచ్చినప్పటికీ దంచుగ లేదు."

"లేదు——"

"ప్లీడరుకూడా ఉగ్రంచుకు. విమలకు విశాల అని ఒక చెల్లె లుందనీ, ఆయిద్దరూ కొంచె మించు మించుగా ఒకే పోలికలో వుంటారని, మన మెప్పుడయితే చెప్పామో--ఆ వెంటనే అత డిటువంటి బ్రహ్మాండమయిన ఎత్తును ఎత్తాడు."

"ఈ మెత్తు కొనసాగినప్పుడు సంతోషించాలి మనం——"

"ఇప్పు డింక యేమయినా, నాకు విచారం లేదుగాని కాళిందీ!

విమలకు నేను గావించిన ద్రోహాన్ని తల్చుకుంటే మాత్రం గుండె ఝల్లుమంటుంది. కళ్లంటనీళ్లు గిర్రున తిరుగుతాయి.'' అని కనకరాజు చెబుతుంటే, కాళింది యేమీమాటలాడలేదు. కనకరాజు కప్పుడుకూడా కళ్లు నీళ్లతో నిండిపోయినాయి. అతను గద్గదస్వరంతో తిరిగి యిలాఅన్నాడు—

"విమలకూ, విశాలకూ, హస్తిమశకాంతర ముంది. అదినన్నే ప్రాణంగా చూసుకొనేది. భరించలేనటువంటి గర్భదరిద్రంలో నన్ను తను - నేను భర్తగా లభించడం తనపూర్వపుణ్యమనుకొని, మురిసిపోయేది, నే నెప్పుడయినా, కోపమొచ్చి - 'వెధవా' అని తిడితే, "అటువంటి తిట్లుమాత్రం తిట్టకండి— మీచేతుల్లో యింతబూడిద అయిపోవాలని నాకోరిక. ఇటువంటి మహాదరిద్రంలో నయితేనూ యీ సహచర్యంవల్ల నేను స్వర్గీయానందము ననుభవిస్తున్నానంటే నమ్మండి.'' అని ఆమె చెప్పుకొని, చెప్పుకొని మురిసిపోయేది. ఒక్కొక్కప్పుడు వరసగా మూడేసిరోజులు, నాలుగేసిరోజులు భోజనమే వుండేదిగాదు. నాతో అటువంటి గర్భదరిద్రమును అనుభవిస్తుండికూడా నన్నంత గాఢంగా ప్రేమించే అమాయకు లెక్కడయినా వుంటారా కాళిందీ?'' అని అతను సంతతధారాపాతంగా కారే కన్నీళ్లను ఒత్తుకొంటూ వుంటే చూసి, కాళింది సహించుకోలేక పోయింది.

"భార్య చచ్చినా, ఆమెమీదవుండే, ప్రేమ చావలేదన్న మాట! అటువంటప్పుడు తిరిగి నన్నెందుకు పెళ్లిచేసుకోవాలి? నేను నిర్బంధం చేశానా?'' అని కాళింది కఠోరంగా అడిగినదానికి, కనకరాజు ఒకనిట్టూర్పు విడిచి—

"అవును—ఇదంతా నా అవివేకం—నా దురాశ! ఇందులో నీ తప్పేమీ లేదు కాళిందీ! ఆ అమాయకురా లీలోకాన్ని విడిచి వెడితేగాని, నీకు తృప్తి కలుగలేదు.'' అంటూ ఆతను దుఃఖము నాపుకోలేక అక్కడనుంచి లేచిపోయినాడు.

౪

"ఇది ఆడవాళ్లు కూర్చుండే వెయిటింగురూంసార్! మీ రిక్కడకు రాకూడదు."

"Never mind —(ఫరవాలేదు) పురుషుల వెయిటింగు రూముకు తాళం వేసివుండడంవల్ల, నే నిక్కడకు రావలసి వచ్చింది." అంటూ ఆ యువకుడు మోటతనంగా, విశాల కూర్చున్న, విశాఖ పట్నం రైల్వేస్టేషను వెయిటింగు రూములో కొచ్చి తన బెడ్డింగు సూటు కేసు వగైరాలను అక్కడ పెట్టుకున్నాడు. అతని చేష్టలవల్ల విశాల కెక్కువ చికాకు కలిగింది. వెంటనే పోయి అధికారుల కీవిషయమును రిపోర్టు చేదా మనుకొంది.

కాని, అత నెవరో పెద్ద ఉద్యోగస్తునిలా వున్నాడు—గొప్ప అందగాడు, అతనివిషయంలో అటువంటి చర్యను తీసుకొంటే, ఏమయినా చిక్కువస్తుందేమో నని ఆలోచించి, ఆమె మొదటి ప్రయత్నమును విరమించుకొంది,

ఆయువకుడు ఆమెతో ఏమీ మాటలాడకుండా, సూటుకేసు తెరచి, దుస్తులను మార్చుకొన్నాడు. పంపు దగ్గరకు వెళ్లి, సబ్బుతో ముఖం వగైరాలు కడుక్కున్నాడు. ఆమె అతని మోటుచర్య లన్నీ అసహ్యించుకొంటూవుంది. అయినప్పటికి ఆతని అద్భుతరూపసంపదను తనలో తాను మెచ్చుకొంటూవుంది. ఆమె హృదయం అతని పరిచయమును కోరింది. క్రమంగా ఆమె కతనియందు కలిగిన ద్వేషభావం తొలగిపోవడం మొదలు పెట్టింది.

మీ దేవూరండీ?" అని, ఆమె తనంతట తానే అతనిని పలుకరించింది.

"మదరాసు" అని ముక్తసరిగా జవాబు చెప్పి, ఆచేరువలోనే వున్న మరి యొక కుర్చీలో కూర్చుని, సిగరెట్టు కాల్చుకోవడం మొదలు పెట్టాడు.

అతడు సుమారు పాతికేళ్ల యువకుడు. ఉంగరాలు తిరిగిన బిరుసు జుట్టు, పచ్చని శరీరచ్ఛాయ, అందమయిన కన్ను ముక్కుతీరు. విశాల

అతని సౌందర్యాన్ని తనలో తానే పలుమార్లు అభినందించుకోవడం మొదలుపెట్టింది. తనకు తానై, అతన్ని ముందుగా పలుకరించినప్పటికీ అతను ముభావంగా వుండడము నామె సహించుకోలేక పోయింది.

అతడు తన దీర్ఘాలోచనలో ఆమెవయిపు సరిగా చూసిన ట్టయినా కనుపించడం లేదు.

"మీ పేరడుగవచ్చునా?" అతి తిరిగి, విశాల అతన్ని పలుకరించింది కాని; అతడు తన ఆలోచనలో ఆమెమాట వినిపించుకోనట్లు నటించాడు. అందుచేత ఆమె ఆప్రశ్ననే అతన్ని తిరిగి అడిగింది.

"మీ పేరును నేను వినవచ్చునా సార్?"

"మధు—"

"అంటే లీపి—కదూ?"

ఆమాట కతనికి నవ్వొచ్చింది.

"అసలు పేరు మధుసూధన్. అయినప్పటికీ అందరూ 'మధు' అనేపిలుస్తుంటారు" అని అతడు తన సిగరెట్టుకు పట్టిన బూడును కింద రాలుస్తూ అన్నాడు.

"ఇలా యెక్కడికి వెళుతున్నారు?"

"కాకినాడదాకా?"

"ఆబండి కింకా చాలాసైముందనుకుంటా."

"వుందాక అరగంట"

ఇంకా చాలాసేపు అతనితో మాటలాడాలని విశాలకు కోరిక కలిగింది. కాని మాటలాడవలసిన విషయ మేమీ అవుపించడంలేదు. తా నతన్నిగురించి అన్నివిషయాలూ లడిగి తెలుసు కున్నప్పటికీ అతడు తన్ను గురించి ఏమీ అడుగక పోవడం ఆమె కేమీ బాగాలేదు. ఆ విషయమునే ఆమె తనలో తా ననుకుంటూ వుండగా యింతలో మధు అన్నాడు—

"మీరుకూడా యీ బండికే వెళతా రనుకుంటాను."

"అవునండీ!"

"ఎందాకా?—"

"కాకేసు ఒక్క దుంచేనా."

"ఇది మీా స్వస్థలమా?"

"కాదు మూా బావగారిపూరు."

"అక్కగారి మొగుడా?"

"అవును."

"పేరు."

"కనకరాజు జంబూరు - మీాకు తెలిసివుండదు."

"మీా స్వగ్రామం ఏదీ?"

"అత్తవారు డోర్నకల్. కన్నవారు విజయనగరం."

అలా ఆమెతో మాటలాడు తున్నట్లే మాటలాడుతూ వున్న మధు కింతలో యేంజ్ఞాపక మొచ్చిందో - అతడు వెంటనే లేచి తన సూటుకేసులో వున్న నోటుపుస్తకమును తీసి తొందర తొందరగా అందులో యేమో రాసుకున్నాడు.

"నా మాటలవల్ల మీాపనికి అంతరాయం కలుగుతుందేమో-"

"లేదు—అంతరాయ మేమీా లేదు, అన్నటు మీా పేరేమిటో అడగడం మరచిపోయాను."

"విశా—విమల"

"విశావిమల."

"విశాల"

"మొదట యింకేమో చెప్పబోయారు?"

"అబ్బే యేమీా లేదు—నాపేరు విమల."

అతడు తనలో తానే కసా రెందుకో నవ్వుకొని దేనినిగురించో దీర్ఘంగా ఆలోచించడం మొదలు పెట్టాడు.

"మీా కేంపని?" అని ఆమె ఏమీా ఆలోచించకుండా అతని నడిగింది.

"పని యేమీా లేదు—మదరాసులో చదువు కొంటున్నాను."

"మీా పరిచయంవల్ల నా కెక్కువసంతోషం కలుగుతూవుంది."

"నాకూ అలాగే వుంది."

"నేను మీ స్నేహమును గూడా అభిలషిస్తున్నాను."

"Thanks very much,,

మీరు కాకినాడలో యెంత కాల ముంటారు?

"చెప్ప లేను."

"మీరు కాకినాడలో వున్నంత కాలమూ అప్పుడప్పుడు నన్ను కలుసుకొంటూ వుంటారా?"

"మీ కేమీ అభ్యంతరం లేకపోతే అలాగే కలుసుకోవచ్చు"

అభ్యంతరం లేదు. కాని. నేను మీకంటే చిన్నదాన్ని. అందు చేత మీరు న న్నీవిధంగా మన్నించడం అనవసరం" అని ఆమె అన్నదాని కతడు చిరునవ్వును నవ్వి వూరుకున్నాడు;

"నేను మీ స్నేహాన్ని అత్యధికంగా వాంఛిస్తున్న సందర్భం లో, మీకలయికకు అభ్యంతరం చెబుతానా?"

"మీవాళ్ల కిష్టముండ దేమోనని అలా అన్నాను. అయితే మీభర్త?"

"నేను వితంతువును."

"I See" అంటూ అతడు తిరిగి, తననోటుపుస్తకములో దేనినిగురించో రాసుకొని, ఆపుస్తకమును తిరిగి, సూటుకేసులో భద్రపరచు కొనివచ్చి ఆమెదగ్గర కూర్చున్నాడు."

"మీరు టిక్కట్టును కొనేటప్పుడు కాకినాడకే నాక్కూడా మరియొక టిక్కట్టును తీసుకొస్తారా? అంటూ, ఆమె తన పర్సులో నుంచి తీసి, టిక్కట్టుసొమ్ము నీయగా, అతడు దాని నందుకున్నాడు. ఇంతలో రాబోయేరైలుకు మొదటిసారి గంట కొట్టబడింది. మధు వెంటనే టిక్కట్టును కొని తేవడానికి వెళ్ళాడు.

"చెప్పుకోతగ్గ అందము - సరసమయిన సంభాషణ! అయాచి తంగా కలసిన ఈ సుందర పురుషుని స్నేహం చిరకాల ముండిపోయ్యే నట్లయి తే బాగుండును. చొరవచేసి నే నంతగా మాటలాడినా, అతడుమాత్రం, నాతో హృదయ మిచ్చి మాటలాడ లేకుండా వున్నాడు. నేను ప్రేమించినంత గాఢంగా అతను కూడా నన్ను

ప్రేమించఁగలిగి నట్లయితే, ఋద్ధరమూ, స్వర్గపరిపాలన చెయ్యమూ! ఇంతకూ కలిగినది క్రొత్తస్నేహము గదా! కొద్దిరోజులు గడచిందంటే అతని హృదయ మెటువంటిదో, నాకూ తెలుస్తుంది అని విశాల తనలో తా నాలోచించుకొంటున్న సమయంలో, మధు టిక్కట్టుకొని తీసుకొచ్చాడు. ఆమెటిక్కట్టును ఆమె కిచ్చి, తన సూటుకేసు వగైరా సామానులను పట్టించుకొని, ప్లాటుఫారంమీదికి పోయినాడు.

అతనుకూడా తనతోనుండి కాకినాడ వరకూ ప్రయాణము సాగిస్తాడేమోననీ, అతని సాహచర్యంలో మరికొంత సేపు గడుపవచ్చు ననీ ఆమె ఆశించింది. కాని అతని కటువంటి యుద్దేశ మేమీ వున్నట్లు కనుపించక పోయిన కారణంవల్ల, ఆమె నిరాశను చెంది, తనసామానులతో రైలురాగానే యెక్కికూర్చుంది. అత నెక్కడయినా కనుపిస్తాడేమోనని, ప్లాటుఫారమంతా కలయ జూచింది. కాని ఆ సుందర యువకు డామె కెక్కడా కనుపించ లేదు.

తీరా రైలు కదలిన సమయంలో మధు వచ్చి ఆమె కూర్చున్న పెట్టిలోనే యెక్కాడు. అప్పు డామెకు మితి లేని ఆనందం కలిగింది.

౫

కనకరాజు కంట తడిపెట్టుకొంటూ కూర్చుంటే కాళింది సహించుకోలేక పోయింది. ఆ విషయమునే తాను గమనించనట్లుగా నటించి దూరదూరంగా తొలగిపోతుంది.

"ఎన్నివిధాల దుఃఖపడితే యేంలాభం? ఎంతగా యేడిస్తే ఏం ప్రయోజనం? అంతా గతజలసేతుబంధనం. బలవంతాన ఆ యువతి గ్యారాలి ప్రాణాన్ని గంగపాలు చేశాను. అందుకనే నాజన్మాంతమూ కుళ్ళికుళ్ళి ఏడువ వలసిందే తప్ప వేరు ప్రయోజన మేమీ లేదు. నాలో ప్రవేశించిన దురాశ నాచేత అటువంటి దారుణకృత్యాన్ని చేయించింది?

కాళింది శ్రీమంతురాలని ఆశపడ్డాను. ఆమెను వివాహం చేసుకొన్నట్లయితే నా దరిద్రం వొదిలి పోతుందని భ్రమపడ్డాను. ఆమెను హత్యగావించిన మొదల తన సర్వస్వాన్నీ నాకు చుట్టబెడతానన్న

కాళింది ఇప్పు డావిషయమునే యెత్తడం మానేసింది. గట్టిగా అడిగితే ఈ కేసు పర్యవసానమును తెలనియ మంటుంది. ఇది పయికి చెప్పు కొనే విషయంగాదు. ఫిర్యాదు చేసుకొనే వ్యవహారమున్ను గాదు. మణిపూసవంటి భార్యను చేతులారా పోగొట్టుకొన్న నా అవివేకాన్ని యేమనాలి? కాళింది చేసిన వాగ్దానం ప్రకారంగా నాకు తన యావ దాస్తినీ రాసి ఈయకపోగా ఇప్పుడీ ఖూనీనేర మొకటివచ్చి నాతలపై పడింది. దీనిని తప్పించుకొనే విధానంకూడా కనుపించడం లేదు.

తానే విమలనని ప్రచారం చేయవలసిందని, కాళిందిచే విశాల నియోగించ బడింది. అయినప్పటికీ ఆ విషయము నెవరు నమ్ముతారు? విశాల నెవరూ గుర్తించనే లేరా? ఆమె విమలకాదన్న యథార్థ విష యం ఎప్పటి కయినా తెలియక పోతుందా? తెలియ నియ్యి, ఇంతకు మించిన ప్రమాద మింకేమీ వుండదు గదా! కాదంటే ఈ హత్యా నేరానికి నేను ఉరిదీయ బడతాను. కావలసిందే. ఏపాపమూ ఎరుగక నన్నే లోకంగా యెంచుకొనే అమాయకురాలిని హత్య గావించిన నాకెటువంటి గొప్ప శిక్షవిధింపబడినప్పటికీ చెల్లుతుంది.''

అని అతడు మొదటి భార్యను తల్చుకొని కుమిలి యేడుస్తున్న సమయంలో, అప్పుడే రైలు దిగివచ్చిన విశాల, ముందుగా కనక రాజునే చూసింది.

"కాళింది యేదిబావా! నువ్విలా కూర్చున్నావేం?''అని అతని నడిగింది.

అతడు ఆతన దుఃఖము నామెకు కనపడనీయకుండా "ఏమీ లేదు. ఇదేనా రావడం? కాళింది లోపల వుంది'' అని ముక్తసరిగా జవాబుచెప్పి తనముఖము నామెనుంచి మరోవయిపు తిప్పేసుకున్నాడు

"కాళిందీ! కాళిందీ!''అని లోపల వున్న కాళిందిని పిలుస్తూ ఆమె అక్కడనే కూర్చుంది. ఆమె గొంతుక వినిపించీవినిపించడంతోనే కాళింది వారున్న దగ్గరకొచ్చి "ఎప్పుడు రావడం విశాలా? అని అడిగింది

"నేను విశాలనుగాను, విమలను'' అని ఆమె నవ్వుతూ అనగా

"ఏమయిందీ? మీచిన్నాయనా మీపిన్నమ్మ, నగై రాలునువ్వు విమల వని నమ్మారా?"

"చాలాకష్టంమీద నమ్మారు. అయిద్దరకూకూడా చూపు సరిగా ఆనకపోవడంవల్ల ఆమాత్రమయినా నమ్మారుగాని, లేకపోతే, ప్రయత్నమంతా వృధా అయిపోయేది"

"అయితే, కనకరాజుకు ఉరిశిక్ష తప్పించావన్నమాట!" అని కాళింది, కనకరాజు వయిపుకు చూస్తూ అంది. అతనికి ముఖం ఎత్తేపని లేదు.

"బావ అలా వున్నాడేం కాళిందీ?" అని విశాల అడిగిన దానికి.

"బావ మీఅక్కయ్యమీద బెంగపెట్టుకున్నాడు. ఆమె చచ్చి పోయినప్పటికీ, ఇతనికామె పై వుండే వ్యామోహం మాత్రం చావ లేదు." అని కాళింది జవాబు చెప్పింది.

"విశాలా! నా ఉరిశిక్షను తప్పించడం కోసం మీ రెవరూ శ్రమపడకండి. నేనటువంటి శిక్షకు తగుదును. మీ అక్కయ్య యెటు వంటిదో నీకు తెలియని విషయం గాదు. నే నా ఉత్తమురాలికి ద్రోహించేసి, మహా పాపము నొడిగట్టుకున్నాను. అందుకు నే నెటు వంటి శిక్ష ననుభవించినా చెల్లుతుంది," అని కనకరాజు చెబుతుంటే విశాలకు స్ఫుతము కళ్లంట నీళ్లు గిర్రున తిరిగాయి.

"అయిపోయిన దానినిగురించి, యిప్పుడెంతగా విచారిస్తే మాత్రం ఏం లాభం బావా! ఈవిషయమును మొదటనే ఆలోచించు కోవలసింది. కాళింది శ్రీమంతురాలుగదా అని ఆశపడ్డావు, ఆమె చెయ్యమన్నపని నెంతఘోరమయినదో ఆలోచించావుగావు. నిన్ను రక్షించడం కోసమయితేనేమి, కాళింది ఈయబోయే అయిదువేల కోసమయితేనేమి, నేను మా అక్కయ్యవైపుండే వాత్సల్యాన్ని కూడా చంపుకున్నాను. లేకపోయినట్లయితే, నువ్వు నాసోదరికి విషప్రయోగ మును చేసి, చంపినందుకుగాను, నేను నీవేపి రక్తాన్ని కళ్ళజూడకుండా విడిచి పెట్టేదాన్నా."

"గడచిపోయినదాని కిప్పు డెక్కువగా పశ్చాత్తాపపడుతున్నాను విశాలా!' అని అత డొక నిట్టూర్పును విడచాడు.

"ఎందుకూ పశ్చాత్తాపం? యిప్పుడయినా మించిపోయింది లేదు. నన్ను పెళ్లిచేసుకో వలసిందన్నీ, నే నెన్నడూ నిన్ను నిర్బంధం చేసి యుండలేదు. నేను చెప్పినవాటి కన్నింటికీ అంగీకరించి, నీ అంతట నువ్వే ముందుకు వచ్చావు. అందు కిప్పుడు విచారించి యేంలాభం? నీ మొదటి భార్యయందు అంత ప్రేమవుంటే, నేనంటే గిట్టకపోయినప్పుడు మన మిద్దరమూ విడిపోవడమే చాలామంచిది. అని కాళింది తీక్షణంగా అనగా—

"నువ్వుకూడ అల్లాఅంటా వేమిటి కాళిందీ. రత్నలాంటి మనిషి. దుమ్ములో కలసి పోనేపోయింది, ఇప్పు డితను నిన్నువిడిచి పెట్టితే మాత్రం ఏమిటి లాభం?" అంది విశాల. కనకరాజు శరీరంలోని రక్తం కాళింది అన్నమాటలవల్ల ఉడుకెత్తి పొంగింది. అత డా ఉద్రేకాన్ని ఆపుకో లేక పోయినాడు.

"కాళిందీ! ను వ్వీటువంటి వంచకురాలవని నే నెప్పుడూ అను కోలేదు. నీకు రెండు నాలుక లున్నాయన్న విషయం నాకిప్పుడు తెలిసింది. మొదట ఒకమాట, యిప్పుడొకమాటనా? మనయిరువురి ప్రేమ సౌఖ్యాలకూ విమల ఒక అడ్డుఅనీ, ఆమెను హత్యగావించినగాని నీ సర్వస్వమూ నాపేర రాసి ఈయననీ చెప్పి, తీరా యిప్పుడు, నిన్ను విడిచిపెట్టినా ఫరవా లేదంటున్నావు! ఛీ! ఆడదానిని నమ్మిన మగ వాడికి పుట్టగతులుండవు—"

"ఇదిగో! నువ్వోనవసరమయిన మాటలంటే యిక్కడ సహించే వా రెవరూ లేరు. నా ఆస్తి, నాహక్కు. నాకిష్టమయితే యిస్తాను లేక పోతే లేదు. నన్ను రొక్కించి అడగడానికి నీ కేమీ అధికారం లేదు." అని కాళింది అన్నమాటలు విశాలకు కూడా అధర్మంగా కనుపించాయి.

"అవేం మాటలు కాళిందీ? అతడు నిన్ను వివాహం చేసు కొన్న దెందుకనీ. బంగారంలాంటి భార్యను చేతులారా చంపుకొన్న దెందుకనీ? మహాదరిద్రంలో వున్న అతడు నీ భాగ్యభోగాలు అనుభ

వించాలనే గదా యింత చేశాడూ? అంతే [illegible]నికి వాగ్దానం కూడా చేశావు."

"చేస్తే - అది వ్రాతమూల మవుతుందా?"

"నీతిగల మనిషికి వ్రాతమూలా లెందుకు కాళిందీ?" అని విశాలకూడా నిష్ఠూరంగానే మాటలాడింది.

"పోనియ్యి విశాలా! ఆమెను ఏమనడానికీ మన కధికారం లేదు. ఇంతకూ నేను మూర్ఖుడనై చేసిన పని తెలివి తక్కువది. అందుకొకరి ననవలసిన అవసర మేముందీ?" అని కనకరాజిక అక్కడ నిలుచోకుండా మరియొకగదిలోకి వెళ్లిపోయినాడు.

"ఈ గొడవకేంగాని నా అయిదు వేలూ యెప్పుడిస్తావు కాళిందీ?" అని విశాల అడిగిన దానికి కాళింది ఏమీజవాబు చెప్ప లేదు.

"నేను పూనుకొన్నది అన్నిటికంటే సాహసమయిన పని. చని పోయిన విమలను నేనే నని చెప్పుకోవడం ఎంత ప్రమాదం?"

"ఈ కేసు పర్యవసానం తేలిన తరువాత యిస్తాలే. ఇప్పు డంత తొందరే మొచ్చిందీ?" అని కాళింది అన్నదానికి విశాల తనలో నేమనుకొందోగాని పయికి మాత్రం ఏమీ అనలేదు.

౬

"హల్లో! రా విమలా! నీ రాకకోసమే యెదురు చూస్తూ న్నాను."

"నిజంగా?" అంటూ విశాల కిలకిల నవ్వుతూ వెళ్లి అతని ఒడిలో కూర్చుంది.

"నిజం విమలా! నీకోసమే కనిపెటుకు కూర్చున్నాను. నువ్వు రోజూ ఒకసారి వస్తున్నావు గనుకనే, యిన్నిరోజులు యిక్కడ వుండ డానికి కారణమయింది. లేకపోయినట్లయితే, నే నీపాటికే యీగ్రామం విడిచి వెళ్ళిపోదును."

"నేనంటే మీకు నిజంగా అంత ప్రేమవుందీ"?

"అలా అడుగుతే ఏమని చెప్పను విశాలా! నేను నిన్ను ప్రేమించినంత గాఢంగా నువ్వుకూడా నన్ను ప్రేమించి వున్నట్లయితే యీపాటికి ఎంత జరిగేది?"

"చెప్పండి ఎంత జరిగేది?"

"మన మిద్దర మీపాటి కెక్కడికో లేచిపోయి వుందుము."

"నిజంగానే మీ కటువంటి వుద్దేశ మున్నట్లయితే నేను గొప్ప అదృష్టవంతురాల్ని."

"అయితే వెళ్లిపోదాం వచ్చేస్తావా?"

"ఎక్కడికి?"

"నేను తీసుకెళ్లిన దగ్గరకి."

"చెప్పకూడదా?"

"మద్రాసు వెళ్లిపోదాం"

"ఇవి హృదయ పూర్వకంగా చెబుతున్న మాటలేనా?"

"నా ప్రేమ నింకా అనుమానిస్తున్నావా విమలా!"

"లేదు - మీరు చెబుతున్నా మాటలు వింటుంటే నే నానందమును పట్టలేకుండా వున్నాను.

"మద్రాసు వెళ్లాక అక్కడ యిద్దరమూ పెళ్లిచేసుకుందాము." అని మధు అనగానే ఆమె సిగ్గుతో తలను కిందికి దించుకొంది.

"పెళ్ళిమాట తలపెట్ట గానే యింత సిగ్గొచ్చి పడిపోయిందేం విమలా?" అని అత డామెను చెక్కిలమీద మృదువుగా తాకుతూ అడిగాడు. ఆమె యేమీ మాటలాడలేదు.

"నన్ను పెళ్లిచేసుకోవడం నీకిష్టం లేదా?" అని అతడు తిరిగి అనగానే ఆమె తన మెరిసే కళ్లతో అతని ముఖంలోకి చూచింది.

"ఇష్టంలేక పోతే యీకథ యింతవరకూ రానేరాదు. ఆనాడు విశాఖపట్నం వెయిటింగు రూములోనే యిద్దరమూ విడిపోయేవాళ్లం."

"మరయితే యిక ఆలస్యమెందుకు? మీవాళ్ళెవరయినా ఏమయినా అంటారని భయంగా వుందా?"

"నేను సర్వస్వతంత్రురాల్ని. నన్నడ్డుపెట్టగలవా రెవ్వరూ లేరు"

"మీ బావగారయిన కనకరాజుగారో"

"ఆయనకు నాపై యెటువంటి అధికారమూ లేదు."

"మీ సవతి అక్కగారి పేరు కాళింది కాదూ?" అని అత నడిగే టప్పటి కామె అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ,

"ఆ విషయం మీకెలా తెలిసింది?" అని అడిగినదానికి కత డొక చిరునవ్వును నవ్వి వూరుకున్నాడంతే గాని ఏమీ జవాబు చెప్ప లేదు.

ఇంతలో మధు బస చేసివున్న బంగాళాదగ్గర కొక పోలీసు సబినిస్పెక్టరు సైకిలుమీద వచ్చి. "మధుసూదన్ గారూ!" అనిపెలు ఫల్లమంచే కేక వేశాడు. మధు యువతులకు తొంగిచూసి తనకొరకు వచ్చిన వా రెవరో తెలుసుకొన్నాడు. విశాలకూడా చూసింది. మధు కోసం పోలీసు సబినిస్పెక్టరు రావడానికి కారణమేమై వుంటుందా అని దీర్ఘంగా ఆలోచించింది. ఒకవేళ మధు ఏసందర్భంలోనైనా నేరమును చేసినవాడేమోనని అనుమానించింది. లేక పోయినట్లయితే ఒక ఘరానా మనిషి దగ్గరకు పోలీసు లెందు కొస్తారనుకొంది.

ఆ విషయమునే మధు నడుగుదామనుకొంటూవుండగా అతడు ఖంగారుతో లేచి, "నాకోస మెవరో వచ్చారు. తిరిగి యిప్పుడే వస్తానుండండి." అని అక్కడి నాబంగాళాలో ఒంటరిగా విడిచి అత డా పోలీసు సబినిస్పెక్టరుతో ఎక్కడికో వెళుతుండడమును చూచి విశాల ఏమీఅర్థం చేసుకోలేక, "ఇతనిమీద డే ప్రమాదంలోనైనాయినా చిక్కు కోడుగదా! పోలీసు సబినిస్పెక్టరుతో ఎక్కడకు వెళ్ళాడు? ఏర్పడినది కొత్తస్నేహం. అందువల్ల అతని మంచి చెడ్డ లేమీ నాకు తెలియవు. ఒక వేళ నేనుకూడా ఇతని మూలంగా ఏప్రమాదంలోనైనా చిక్కుకోను గదా! నేను విశాలనై వుండి విమలనని చెప్పుకొంటూ వ్యవహరిస్తున్నాను. ఇది ఒక గొప్ప నేరం. ఈరహస్యంగనుక పోలీసులకు తెలిసినట్లయితే ఎంతప్రమాదం? కాళింది ఈముఖంలోనే అయిదు వేల రూపాయలకూ ఆశపడి ఈసాహసానికి పూనుకుంటే ఇప్పు డామెదగ్గర మంచి ఆ డబ్బుకూడా వచ్చే నమ్మకం లేకుండావుంది. ఇప్పటికి

ఖర్చుల పేరు చెప్పి నాలుగువందలుమాత్రం యిచ్చింది.

మదరాసు తీసుకెడతా నన్నాడు - పెళ్లి చేసుకుంటా నంటు న్నాడు. గొప్ప అందగాడని - నాకు తగినభర్త కాగలడనీ ఆసించి యితనిని ప్రేమిస్తే యితని చర్య లేమీ అర్థంగాకుండా వున్నాయి.'' అని తనలో తా నాలోచించు కొంటూ విశాల మధురాకకోసం ఒక పావుగంట అరగంటకూడా వేచి వుంది. అతను తిరిగి రాలేదు. ఆమె కేమీతోచిందిగాదు, ఆగదిలోనే అటూయిటూ పచార్లు చేయ డం మొదలు పెట్టింది.

అక్కడ బల్లమీదవున్న ఒక సూటుకేసుపై ఆమెదృష్టి అప్రయత్నంగా పడింది. మధు పరాకున ఆ పెట్టెకు తాళం వేయడం మరచి పోయాడు. విశాలకు అందులో యేముంటుందో చూడాలన్న బుద్ధి పుట్టింది. మధు వస్తు న్నాడేమోనని ఒకసారి బయటకు వచ్చి చూచింది. అతడు రానడంలేదని తెలుసుకొని ఆమె వెంటనే ఆ పెట్టె మూతను తీసి చూచింది. అందులోవున్న వింతవస్తువులను చూసేట ప్పటి కామె నిలువునా నిర్ఘాంత పోయింది.

బైరాగులు ధరించే ఒక కాషాయాంగరక్షా, ఒక దండము, కృత్రిమపు గెడ్డము, జడలు, బైరాగి వేషానికి పనికివచ్చేసాధన సామగ్రిఅంతా అందులో వుంది.

తరువాత, రెండు చీరలు, కొన్ని జాకెట్లు, పెద్దతలకట్టుతోవుం డే విగ్గొకటి, గాజులజతలు, లోలకులు, మొదలైన స్త్రీలకు పనికివచ్చే వస్తువులు కూడా అందులో వుండడమును చూచి ఆమె ఏమీ అర్థం చేసుకోలేకపోయింది.

ఆమె క్షణకాలం దీర్ఘంగా ఆలోచించింది. తా నింతకుముందు విజయనగరంలో పినతండ్రిగారింటిదగ్గర వున్నప్పుడు వచ్చిన ఆ బైరాగి ఆమె స్మృతిపథంలో మెదిలాడు.

"నీ అప్పగారు బలవన్మరణమును పొందింది ఆమె ఖూనీ చెయ్యబడింది'' అని ఆనాడా బైరాగి చెప్పినమాట లామెహృదయంలో

ప్రతిధ్వనించడం మొదలుపెట్టాయి. అదే గడ్డం, అవే జడలు, దుస్తులునూ అవే!

"ఇదేమిటో చాలా ఆశ్చర్యంగా వుందే! ఆనాటి బైరాగి ధరించిన దుస్తులు మధు సూటు కేసులో కెందుకొచ్చాయీ? అతనికీ ఈతనికీ ఏమిటీ సంబంధం? ఒక వేళ ఈతనే, ఆనా డటువంటి బైరాగి వేషమును ధరించి వచ్చివుంటాడా? అందువల్ల ప్రయోజనమేమిటీ? ఇంకా లోతుగా ఆలోచించి చూస్తే, ఈమధుగొంతుకా, ఆనాటి బైరాగి గొంతుకా, ఒకేలాగున కనబడుతు న్నాయి. ఈ వ్యవహారమంతా చూస్తూవుంటే, ఈ మధు జీవితంలో ఏవో బ్రహ్మాండమయిన రహస్యాలు యిమిడివున్నాయని వూహించికోవలసి వస్తూంది. ఇందులో వున్న వస్తువులంబట్టి ఈతడు ఆడవేషాలు కూడా వేస్తాడని తెలుస్తూంది. లేకపోయినట్లయితే, స్త్రీలు ధరించే వస్తువు లీతనిదగ్గర యెందుకుంటాయి? మధు యీ వేషాలు యెందుకు వేస్తున్నాడో, పోలీసులతో ఈతనికి వ్యవహారా లేమిటో, నాకేమీ అర్థమవడం లేదు. ఇప్పుడు నేనెటువంటి చిక్కుల్లో పడిపోతానోగదా!?"

అని విశాల తనలో తాను ఆలోచిస్తుండగా యింతలో, బయట అడుగులచప్పుడు వినిపించడమునుబట్టి, మధు వస్తున్నాడని వూహించుకొంది. ఎక్కువ వ్యవధి లేకుండగానే, మధు లోపలకొచ్చేసాడు. విశాల అతని సూటుకేసుదగ్గర బిక్కచచ్చిపోయి నిలుచుంది. ఆమె తన వస్తువులన్నింటినీ పరిశీలిస్తున్నట్లుగా గ్రహించిన మధు ఆమెవయిపు ఎర్రగాచూశాడు.

అప్పుడునిమిషాలవరకూ యెవరినోటంటాకూడా మాటరాలేదు. ఇద్దరూ చెరో కొయ్యబొమ్మలాగునా, అలాగే మరికొంతసేపు చేష్టలుదక్కి ఒకరికెదురుగా మరిరొకరు నిలుచుండిపోయినారు.

౭

"నాసూటు కేసును నిన్నెవరుతియ్యమన్నారు విమలా?" అని అతడు తీక్షణంగా అడిగేటప్పటి కామెగుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టాయి "మాటలాడ వేం?" అని అతడు తిరిగి అడిగాడు

"ఈ సూటుకేసును నేను తియ్యలేదు. మీరే తాళం వేయడం మరచి పోయారు."

"తీసివుంటే మాత్రం, నిన్నుంచులోని వస్తువుల నెపరు చూడమన్నారు?"

"పొరబాటు, క్షమించండి' అని ఆమె వణుకుతున్న గొంతుకతో అంది."

"అయితే శిక్షించండి"

"ఏ విధంగా శిక్షించాలి?"

"మీ యిష్టమొచ్చినట్లు"

"నీకు తగిన శిక్ష యేదో నువ్వే చెప్పు-"

"నాకేం తెలుస్తుంది?"

"ఆలోచించి చెప్పు"

"నేను చేసిన తప్పుకు యిక నాముఖం చూడకుండా వెళ్ళిపొమ్మనండి"

"ఊహూఁ! ఆశిక్ష కాదు".

"జుర్మానా వెయ్యండి ఇచ్చుకుంటాను."

"అబ్బే! అదికూడా పనికిరాదు."

"అయితే, యిహ మీయిష్టం"

"నా యిష్టమేనా?"

"ముమ్మాటికీ మీయిష్టమే"

అంతవరకూ కూడ, మధుయొక్క భావం విశాలకు తెలియలేదు. ఆసామానులన్నీ చూసినందు కతడాగ్రహపడుతున్నాడే అని, ఆమె హడలిపోతూవుంది.

"ఇదిగో! నువ్వు చేసిన తప్పుకిదే శిక్ష" అంటూ అతడామెను బలంగా దగ్గరకు తీసుకొని, ఆమెపెదవులపై ఒకటిగాదు రెండుగాదు, ఏపాతిక ముప్ఫయి ముద్దులో పెట్టుకొన్నాడు. అతని యొక్క సరళ స్వభావాన్ని విశాల అప్పుడర్థం చేసికొని, "అబ్బ! ఎంత గొప్పశిక్షను విధించారండీ!" అంది.

"మన ఆనందానికి అనవసరంగా అంతరాయం కలిగింది. రా, కూర్చుందాం" అంటూ, అతడు ఆమెను తనక్యాంపు క్యాటుమీాదికి తీసికెళ్లి కూర్చోబెట్టుకున్నాడు.

"మిమ్మల్ని ఇప్పు డెవరూ పిలుచుకెళ్లారు?"

"చూడలేదు పోలీసు సబినిస్పెక్టరు."

"పోలీసులతో మీాకేం వ్యవహారాలుంటాయి?"

"వ్యవహారాలేమీా లేవు, అతడు నాకొక ముఖ్యస్నేహితుడు."

"నాతో అబద్ధం చెబుతున్నారు." అని ఆమె అనగా, అతడు చిరునవ్వుముఖంతో—

"విమలా!" అన్నాడు.

"పోనీగాని, మీా సూటుకేసులో అటువంటి వస్తువు లెందుకున్నాయో చెప్పండి; బైరాగివేషానికి పనికివచ్చే- దుస్తులు, ఆడ వేషానికి అక్కరకొచ్చే వస్తువులు, అవన్నీ మీాకెందుకు? మీారు నాటకాల్లో వేషాలు వేస్తారా?" అని అమె అడుగుతూవుంటే, అతడు పకపక నవ్వడం మొదలుపెట్టాడు.

"మీా రెప్పుడయినా విజయనగరం వచ్చారా?"

"విజయనగరం! జ్ఞాపకంలేదు."

"ఎందుకొచ్చిన అబద్ధాలివీ? మీా రొకప్పుడు బైరాగి వేషం వేసుకొని, నే నున్న మా బాబయ్యగారింటికి రాలేదూ?" అని ఆమె అడుగుతూవుంటే, "బైరాగివేషం" అని అతడు మరింత గట్టిగా నవ్వడం మొదలుపెట్టాడు. దానితో ఆ నాటకమంతా ఆడినది అతనే నని ఆమె నిర్ధారణ చేసుకుంది. కాని, అతని కా అవసర మెందుకొచ్చిందో మాత్రం గ్రహించుకోలేక పోయింది.

"విమలా! నువ్వు సి. ఐ. డీ. లను పట్టుకొనే సి. ఐ. డీ లా వున్నావు, గాని సామాన్యురాలివిగా లేవు." అన్నాడు.

"అయితే, మీారు చేసేది సి. ఐ. డీ. ఉద్యోగమన్నమాట?" అని ఆమె ఆశ్చర్యవిభ్రాంతురాలై అడిగింది.

"అందుకు నువ్వెక్కువగా భయపడవలసిన అవసరం లేదు. విమలా! నువ్వు నాకు కాబోయే భార్యవు. అందుచేత నీ కపకారమును చేయడం, నాకు నేను అపకారం చేసుకోవడమే. తెలిసిందా? అందువల్ల నువ్వేమీ భయపడకు. నేను అటువంటి ఉద్యోగంలో వుండటం వల్లనే పోలీసులతో ఎక్కువగా పనివుంటూ వుంటుంది." అంటూ అత డామెను తిరిగి దగ్గరగా తీసుకొని ముద్దుపెట్టు కున్నాడు.

"అయితే, ఆనాడు బైరాగి వేషంతో విజయనగరంలో మా వాళ్ళయింటికి వచ్చింది మీరేనా!"

"అవును"

"ఎందుకు వచ్చారు?"

"చెప్పాలా?"

ఆమె కొంతసేపటి వరకూ మాటలాడ లేక పోయింది. విమల యొక్క ఖూనీ కేసును కనిపెట్టడాని కతడు నియోగింపబడి, సర్వమూ తెలుసు కొన్నాడని అర్థం చేసుకుంది.

"నేను నీ విషయమంతా తెలుసుకున్నానని భయపడుతున్నావా"

ఆమె మాటలాడ లేదు.

"ఏమీ భయం లేదు. నువ్వు విమలవయినా, విశాలవయినా, నా ప్రేమ మరో వయిపుకు మళ్ళదు." అని మధు అంటూవుంటే, విశాల అతని కళ్ళల్లోకి ఆశ్చర్యంగా చూస్తూంది.

"బెదరి పోకు విశాలా! నువ్వు నిజంగా విమలవుగావనీ విశాల వనే గాక, యింకా విమల, మీ బావచేత ఏ విధంగా విషప్రయోగము చేయబడిందో, మీ కనకరావు విషమును ఏ కొట్టులో కొన్నాడో ఈ ఘోర కృత్యములను చేయవలసిందని, కాళింది అతనిని ఎంతగా నిర్బంధం చేసిందో మొదలయిన విషయాలన్నీ నా నోటు బుక్కులో వున్నాయి, చూస్తావా?" అని మధు చెబుతూవుంటే, విశాల చేష్టలు దక్కి కూర్చోవడం కంటే, యింకేమీ చెయ్యలేక పోయింది. మరి కొంత సేపామెను బుజ్జగించి భయము నంతనీ పోగొట్టాడు మధు.

అనంతరం,

" నువ్వింత భయం గలదానవయితే ఇటువంటి సాహసాని కెందుకు పూనుకున్నావు విశాలా! నేను గనుక సరిపోయిందిగాని, ఇదే మరియొక సి. ఐ. డి. అవుతే ఏమయ్యేది!"

విశాల ఏమీ మాటలాడలేక పోయింది

"కాళింది ఈయబోయేడబ్బు కాశపడి విమలనని చాటుకు తిరుగుతున్నావు. ప్రత్యేకము, పని కట్టుకొని, బంధువులందరదగ్గరకూ వెళ్లి విమల చనిపోలేదనీ, నువ్వే ఆవిమలవనీ చెప్పుకొని ఆ విషయ మును స్థిరపర్చాలని యెంతయినా ప్రయత్నం చేస్తున్నావు. అవునా.

"కాదని యిప్పుడు మీ దగ్గర చెప్పినందువల్ల యేమీ ప్రయోజనం లేదు. మీరీ కేసుకు సంబంధించిన సర్వవిషయాలూ కూపీతీశారు, మీరు చెప్పినట్లుగా, నేను డబ్బుకాశపడి, యీ పని కొప్పుకున్నాను. కాళిందీ కనరాజు లీవుపకారమును చేయవలసిందని, నన్ననేకవిధాల బ్రతిమాలుకున్నారు. మా అక్కయ్య, నేను ఒకే పోలికలో వుండడంవల్ల, నేనే ఆ విమలనంటే, సులువుగా నమ్ముతారని అందరూ అభిప్రాయపడ్డారు."

విశాలా! ఇంతటినుంచయినా నిన్ను విశాల అని పిలవవచ్చునా అని అతడు చిరునవ్వుముఖంతో అడిగాడు.

"యథార్థమంతా మీకు తెలిసిపోయింది. బైరాగి వేషాలు వేసుకొని, స్త్రీవేషములను ధరించీ, మీ రక్కడక్కడ తిరిగి సర్వమూ తెలుసుకున్నారు. అయితే యికముందు జరుగబోయే విషయ మేమిటో చెప్పండి."

"ఏమీ లేదు రేపు కోర్టులో నువ్వు అబద్ధం చెప్పడానికి ప్రయత్నం చెయ్యకు. యథార్థ విషయమునంతటినీ ఉన్నదున్నట్లుగా చెప్పెయ్యి. నీకేటువంటి హానీ రాకుండా చెయ్యగల బాధ్యత నాది. ఇందులో కనకరాజునుకూడా తప్పించవచ్చును. కాళింది తాను చేసిన ఘాతకు తగిన ఫలితము ననుభవించగలదు " అని అతడు చెప్పినదానిని విశాల ఆశ్చర్యంతో వింది. అతడు ఈ కేసు పర్యవసానం తెలిపోయిన

వెంటనే, మన మిద్దరమూ మదరాసు వెళ్ళిపోదాం. ఈసమాచారమును మాత్రి మెవరితోనూ చెప్పబోకు'' అన్నాడు.

ఆమాటల నాలకించినవిశాల అంతవరకూ తానదృష్టవంతురాల ననుకుంది.

౮

''విశాల ఏమయి పోయిందో! మధ్యాహ్నం భోజనం చేసి వెళ్లింది, యింతవరకూ యిల్లు చేరుకో లేదు.''

''ఈమధ్య రోజూ యిదేవిధంగా వెళుతూంది, ఎక్కడికో తెలి యదు.''

''రేపు కేసు వ్యవహారము, ఈలోపుగా ఆమె నొక్కసారి తీసు కురావలసిందని చెప్పాడు వకీలు. ఈ వేళ తీసుకెడదామనుకుంటే ఆమె యెక్కడికో పోయింది.''

''దానికి అనుకున్న ప్రకారంగా అయిదువేల రూపాయిలు నువ్వీయలేదని కోపం.''

''కేసు పర్యవసానం తేలగానే యిస్తానని చెప్పలేదూ!''

''ఆమాటలతో ఆమె తృప్తిపడలేదు. నాకు చెప్పినట్లుగానే ఆమెకు కూడా చెబుతే ఎలా కుదురుతుంది?''

''నేనే మయినా పారిపోయేదాన్నా?''

''కాకపోతే మాత్రం ఆడినమాట ప్రకారం, ఎప్పటి వ్యవహా రం అప్పుడు తేలిపోవడం మంచిది, ఈ వాయిదాతో కేసు ఆఖరై పోయేదికాదు గదా, ఇంకా యెన్నివాయిదాలు పడతాయో యెవరికి తెలుసు.''

''అవసరం లేదు త్వరగానే తేలిపోతుందని వకీలు చెబు తున్నాడు.''

''మనం విశాలను ప్రోత్సహించి, ఆమే విమల అని తంత్రం చేసినట్లు మనయిద్దరమూ కలసి, విమలకు విషప్రయోగంచేసి చంపే సట్లు, కోర్టులో రుజువయినట్లయితే నాకు ఉరిశిక్షను విధిస్తారు అవునా?''

సీ క్రెట్ లవర్

"మనవకీలు అంతవరకూ రానిస్తాడా యేమిటి? ~~[illegible]~~ మాకు వాయిదాల్లో కొట్టివేయిస్తానని గ్యారంటీ చేశాడు తెలిసిందా?"

"ఏది ఏమయినా విమలకు నేను మహాద్రోహం చేశాను కాళిందీ?"

అందుకు కాళింది ఏమీ జవాబు చెప్పలేదు.

"నాలాంటి పాపాత్ముడు, ద్రోహి యింకెక్కడా పుట్టబోడు."

"అటువంటిమాటలనే పదేపదేసార్లు అనవద్దని, అనేకసార్లు చెప్పాను."

"నీ నిర్బంధమువల్ల ఆ కానిపని కొడిగట్టుకున్నాను. నువ్వాశ పెట్టినదానికి మోజుపడ్డాను."

"అయితే యిప్పుడేమంటావు? జరిగిపోయినదానిని గురించి అనుకున్నందువల్ల, ప్రయోజనం నాస్తి..."

"అవునుకాని, ఆవిషయమును తల్చుకొంటేమాత్రం నా హృదయం తరుక్కుపోయేటంతటి దుఃఖమొస్తుంది కాళిందీ! నా తెలివితేటలు, నా విద్య, నా సామర్థ్యము, కట్టుకొన్న భార్యకు విషప్రయోగమును చేసి చంపడాని కుపయోగపడ్డాయి"

"సరే ఈగోల నీకు రోజూ వున్నదేగాని, విశాల ఎక్కడికి పోయిందో ఒకసారి ఊళ్ళోకి వెళ్ళి తీసుకురా, వకీలు దగ్గరకు వెళ్ళాలి."

"ఎక్కడుందని వెళ్ళను?"

"స్నేహితులింటిదగ్గర యెక్కడయినా వుంటుందేమో చూస్తేసరి"

"ఆమె స్నేహితుల నెవర్నీ నే నెరుగను."

"నిత్యమూ ఆమె యిలాగే యెక్కడికో వెళ్ళి, సాయంకాలం యిల్లు చేరుకొంటూవుంది, చక్కగా ముస్తాబై మరీ వెడుతుంది. ఈ వ్యవహారమంతా చూస్తుంటే, ఆమెకు సీక్రెట్‌గా యెవరయినా లవర్ వున్నాడేమోనని అనుమానంగా వుంది."

"ఉంటే వుండనూవుంటాడు పద్దెనిమిది, యిరవైయేళ్ళ వితంతువు మంచి యౌవనంలోవున్న సౌందర్యవతి ఆమె కెవరో సీక్రెట్‌లవర్ వున్నాడంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు."

"ఇదివరకు లేదు. ఈమధ్య అనగా ఆమె విజయనగరం వెళ్ళి వచ్చినప్పటినుంచి మాత్రమే యిల్లు పట్టకుండావుంది."

"నువ్వు చెప్పినది నేను కాదనను. ఆమె కెవరో రహస్యప్రియుడు వుండేవుంటాడు. విశాల మంచి ఖులాసాయువతి; విమలా విశాలలు అక్కచెల్లెళ్ళయినప్పటికీ గుణాలలోమాత్రం యెక్కడా పోలిక లేదు. ఇద్దరూ తోబుట్టువులే అయినప్పటికీ, విమల అగ్నిహోత్రంలాంటి మనిషి, మహాపతివ్రత, విశాల చంచలస్వభావురాలు. ఖులాసాయువతి ఆమె కెక్కడో సీక్రెట్‌గా లవర్ వుంటాడంటే, నేను కాదనను—"

"బాగా రాత్రిపోయినాకవ్చతే, ఆవకీలు పడుకుంటాడోయేమో. రేపు ఉదయం అసలే వీలుండదు. ఒక్కసారి అలా వెళ్ళి విశాల యెక్కడయినా కనుపిస్తుందేమో చూడరాదూ?"

"ఎక్కడికని వెళ్ళను?—ఆమె యెక్కడ కనుపిస్తుంది?" అని సణుక్కుంటూ, కనకరాజు మెల్లిగాలేచి పయిమీద కండువా వేసుకొని బయలుదేరబోతూవుంటే, విశాల ఒక జట్కాబండిమీద వచ్చి దిగింది. ఆమెను చూడగానే కాళింది ఆగ్రహమును పట్టలేకపోయింది.

"ఇప్పటికయినా యిల్లు కనుపించిందా విశాలా!" అని తీక్షణంగా అడిగింది.

కొంచెం పనివుండి కాకినాడ వెళ్ళానక్కా! వెంటనే రావడానికి బస్సు దొరికిందికాదు."

కాకినాడలో నీ కేమన్ని వ్యవహారాలు ములిగిపోయాయి."

"అక్కడ ఒక స్నేహితుడుంటే, కలుసుకుందామని వెళ్ళాను."

"ఎలాంటి స్నేహితుడూ?"

"అంటే?"

"ప్రియుడా?"

"ఆవేం మాటలక్కా?"

"నాకు తెలుసులే! ఈవేళే నేకాదు, నువ్వు ప్రతిరోజూకూడా కాకినాడ వెళ్ళివస్తున్నావు. అక్కడ నీ కెవరో సీక్రెట్ లవరు వున్నాడు అవునా?" అని కాళింది అడిగేటప్పటికి విశాల తెల్లబోయింది. తన

యొక్క రహస్యం ఆమె కెలా తెలిసిందా అని, ఆశ్చర్యపోయింది. చిరునవ్వు ముఖంతో ఒకసారి కనకరాజువైపు చూసింది. ఆమె యొక్క మార్పు, వాలకమూ చూడగా, కాళింది చెప్పినట్లుగా విశాల కెవరో సీక్రెట్ లవర్ కాకినాడలో వుండివుంటాడనే, కనకరాజుకు కూడా అనుమానం కలిగింది.

"నిజమేనా యేమిటి విశాలా? నువ్వు రోజూ కాకినాడ వెళ్లి వస్తు న్నావా?" అని కనకరా జడగ్గా, అందుకు సందేహ మేమిటే! వెళ్ళే టప్పుడు చూడ లేదూ? సీతాకోకచిలుకలాగున ముస్తాబయి వెళ్లింది. ఒక్కముడత అయినా లేని ఈ వాయిల్ చీర ఎలా నలిగిపోయిందో చూశావా? తలంతా అలా యెందుకు రేగిపోయిందో ఎవరికి తెలీదూ? యిప్పుడు కోసిన పువ్వులు పెట్టి వెళ్లింది. వాటికిప్పుడు పువ్వుల రూపమయినా వుందా?" అని కాళింది యింకా యింకా ఏదో పొడుపు మాటలాడుతూవుంటే...

"హో అక్కా! నీ వేళాకోళంమాటల కేంగాని, బావ యెక్కడికో పయిమీద కండువా వేసుకొని బయలుదేరుతున్నాడూ, యింత రాత్రివేళ?"

'ఇంకెక్కడికీ నువ్వేమయిపోయినావో అని వెదకడానికి బయలు దేరాడు."

"అంతా విచిత్రం. నే నేమైపోతాను?"

"ఇంతరాత్రి వరకూ కొంపకు చేరుకోకపోతే యేమనుకోవాలి?"

"బాగానేవుంది..."

"రేపు మన కేసు వాయిదా అన్నవిషయం జ్ఞాపక ముందా? మరచిపోయావా?"

'ఎందుకు మరచిపోతాము?"

"ఏమోలే! యిప్పుడు నీపని యెలా వుండాలో అలావుంది."

అందుకు విశాల ఏమీ జవాబు చెప్ప లేదు.

"త్వరగా భోజనం చేస్తే, ఒకసారి వకీలుగారింటికి వెళ్లి రావాలి. రేపు మళ్లీ వీలుండదు."

"నాభోజనం కాకినాడలోనే అయిపోయింది."

"క్షేమం!"

"అయితే రేపు కోర్టుకు రావాలని, నా బుద్ధి పుట్టకుం లేదు"

"అదేం? నీ కేమయినా మతిపోయిందా యేం?"

"మతిపోలేదు-ఏమీా పోలేదు!"

"మరెందుకు?"

"నాకు డబ్బుయిస్తానని, యెప్పటి కప్పుడే గడిపేస్తున్నావు."

"ఇంకెంతకాలం? ఈ వాయిదాతో ఏదో ఒకటి తేలిపోతుంది తేలిపోయిన వెంటనే నీవిస్తా నన్న సొమ్ము నంతటినీ ఒకేసారి యిస్తాను."

"నా కలాపనికి రాదు. ఇప్పుడు యిస్తేనే, రేపు కోర్టుకు హాజ రయ్యేది. లేకపోతే లేదు." అని విశాల నిర్మొగ మాటంగా చెప్పేటప్ప టికి, కాళింది కపరిమిత మయిన ఆగ్రహం కలిగింది.

"అంతే నన్నమాట!"

"ఆc! అంతే నువ్వు మొదట అన్నమాట నెందుకు నిలబెట్టు కోకపోవాలి?" అని విశాల నిర్మొగమాటంగా తిరిగి అనేటప్పటికి కాళింది క్షణం తనలో తా నేమో ఆలోచించుకొని "సరే నీగుణం తేలిపోయిందిగాని, అంతకంటే, యింకేమీా లేదు. లోగడ నీకు అయిదు వందలిచ్చాను. ఇంకా నాలుగువేల అయిదువందలు వస్తాయి. తీసికో" అంటూ కాళింది యినపపెట్టె తాళమునుతీసి, అంతసొమ్మునూ లెక్క పెట్టి, కోపంగా ఆమెపై విసిరికొట్టి- "రా! లాయరుగారింటికి వెళ్లాలి" అంది.

విశాల ఆ సొమ్మును తన పెట్టెలో భద్రపరుచుకొని, కాళింది తోనూ, కనకరాజుతోనూ, లాయరుగారింటికి బయలు దేరింది. కాళింది యొక్క తెగింపుకు కనకరాజు తనలో తా నాశ్చర్య పోయినాడు.

౯

ఆ మర్నాడు కనకరా జింకా నిద్ర మంచముమీదనుంచి లేవ లేదు. విశాల అతనిదగ్గరకు హడావిడిగా వచ్చి "బావా! బావా! త్వరగా లేవాలి." అని అతని వీపుమీద తట్టి లేపేటప్పటికి కళ్ళు కళ్ళు నులుపుకొంటూ ఖంగారుతో లేచాడు. నాలుగయిదు ఘంటలు తెల్ల వారు ఝామున ఆమె తన్నంత హడావిడిగా లేపడానికి గల కారణ మేమిటో అత డర్థం చేసుకోలేకపోయినాడు.

"త్వరగా లేచిరా బావా! కాళింది లేచేలోపుగా మనమిద్దరమూ కొన్ని రహస్యాలు మాటలాడుకోవాలి." అని అతన్ని చెయ్యిపట్టుకొని దొడ్లోకి నడిపించుకొని తీసుకెళ్ళింది. ఆమెయొక్క చర్య లేమీ అర్థం గాకపోవడంవల్ల అతనిగుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టాయి.

"ఏమిటి విశాలా! ఇంత చీకటి వుండగా నన్నెందుకు లేపు కొచ్చావు?" అని అతడు కంపించే గొంతుకతో అడిగాడు.

"మెల్లిగా మాటలాడు. నీతో యిప్పుడు కొన్ని ముఖ్యవిషయాలు చెప్పదలుచుకున్నాను" అని విశాల అనేటప్పటికి కనకరాజు ఆమెముఖం లోకి మరింత ఆశ్చర్యంగా చూడడం మొదలుపెట్టాడు.

"నిన్న రాత్రి వకీలు చెప్పినమాటలు విన్నావుగదా!"

"విన్నాను. అతడు మనయిద్దరిమీదా కేసువున్నట్లుగా చెబు తున్నాడు. మనమిద్దరమూ చెప్పబోయే దానిమీదనే కేసు కొట్టివేయ బడడమో, నాకు శిక్ష విధించ బడడమో జరుగుతుందని చెబు తున్నాడు."

"నీకంటేకూడా నా సాక్ష్యం చాలా ముఖ్యం. తరువాత మీ బాబయ్య, పిన్ని వగైరా యితర సాక్షులు కూడా వస్తారు. ఇప్పు డింతకూ కాళిందిమీద ఏమీ నేరం లేదు."

"అవును. ఆమె తెరచాటున వుండి గ్రంధమంతా నడిపించిన మనిషి. కాబట్టి ఆమె కీకేసులో జోక్య మేమీ లేకుండాపోయింది."

"నిజానికి కాళింది ప్రోత్సాహంవల్ల నువ్వు మా సిసులకు విషప్రయోగమును చేశావుగాని, లేకపోతే చేస్తావా."

"ఎందుకు చేస్తాను? అంతగా ప్రేమించిన విమలను చంపు కొంటానా? డబ్బు వ్యామోహంలోపడి, మంచిచెడలు తెలుసుకోలేని వాడ నయినాను."

"ఆమె ఇంతవరకూ నీకేమీ ముట్టజెప్పలేదు. ఇకముందయినా ముట్టచెబుతుం దన్న గ్యారంటీ లేదు. ఆవిషయం ఎలాగ వున్నప్పటికీ, సాక్షు లేమాత్రం జంకినా నీ శిక్ష తప్పదు."

"ఏం చెయ్యను విశాలా! నాఖర్మ మిలా కాలింది. అట్టు బంగారపు బొమ్మలాంటి విమలనూ చంపుకొన్నాను. ఇటు కాళింది ఆ స్త్రీ చెడ్డాను. పైగా శిక్ష విధించబడిందంటే, ఆమనోవ్యాధితో జైలులోనే ప్రాణాలు విడుస్తాను. అంతకు మించిన వేరుదారేమీ కనుపించడం లేదు.

"ఈ కేసు కొట్టేస్తారన్నమాట వట్టిది. బాధావిను. ఈ కేసుకు సంబంధించిన కూపీలు తియ్యడానికి ఒక సి. ఐ. డీ. నియోగించబడ్డాడు. అతడు ఈ కేసుయొక్క యధార్థ విషయాల నన్నింటినీ తెలుసుకొని రికార్డు చేసుకొన్నాడు"

"అయితే యిహ నెందుకూ? నాప్రాణాల్లపై ఆశ వదులుకో వచ్చు"

"నేను నిజంగా విమలను గానసీ విశాలననీ కాళింది ఈ నాటకము నంతటునీ నాచేత ఆడిస్తూందనీ, వివరా లెందుకు? ఆ సి. ఐ. డి. కి సర్వమూ తెలుసు?"

"ఇప్పు డింతకూ యీ కాళిందితోటి వివాహం నాకంతేంమిటాడి కొచ్చింది. పోనీలే విశాలా! విమలతోపాటే నేనున్నూ చచ్చిపోతాను."

"బావా! నువ్విప్పు డింతగా విరుత్సాహపడవలసిన అవసరం లేదు. ఆ సి. ఐ. డి తోనే నాకు స్నేహం కలిసింది. మా యిద్దరికీ రెండుమాసాలనుంచి ప్రేమభావం కూడా యేర్పడింది. నేను అతనిని ప్రేమించాను."

"అయితే, నీ కెవరో సీక్రెట్ లవర్ వున్నాడని, కాళింది అన్న మాటలు యథార్థమే నన్న మాట?"

"అవును బావా! నీదగ్గర దాచడమెందుకూ? అతను సి. ఐ. డి. అని తెలియక పూర్వమే, మే మిద్దరమూ ఒకరి నొకరం ప్రేమించు కున్నాము. నేను విశాల నన్న యథార్థ విషయం అతనికి మాత్రం ఆదిలోనే తెలుసు. అనగా, ఈ కేసుకు సంబంధించిన యావత్తు వివ రాలనూ అతడు తెలుసుకొన్నా అనంతరమే, మా ఇద్దరకూ స్నేహం కుదిరందన్న మాట!"

"అయితే, ఇప్పుడు నేను రక్షించ బడడాని కేదయినా మార్గ ముందా విశాలా?"

"ఉంది-ఇప్పు డా విషయమును చెప్పడానికే ని న్నిప్పుడు లేపు తొచ్చాను."

"ఏమి టదీ?"

"ఈ కాళింది చేసిన ఘోరానికి, ఆమెకు తగిన ప్రతీకారమును చేయడానికే నేను సంకల్పించుకొన్నాను. ఇందులో నువ్వు కూడా కలసి వచ్చినట్లయితే, నీకు విధింపబడు శిక్ష ఆ దుర్మార్గురాలికి విధించ బడుతుందని ఆ సి. ఐ. డి. నాకు చెప్పాడు. మా అక్క విమల అకాల మరణము పొందడానికి కాళింది ముఖ్యకారకురాలు. కనుక మన మిద్ద రమూ కలసి, ఆమెకు తగిన గుణపాఠమును చెప్పాలి."

"అందు కేదయినా మార్గ ముంటే, ఆవిధంగా చేయడానికి నేను మొదటివాణ్ణి. త్వరగా చెప్పు విశాలా! నేను రేపు కోర్టులో ఏమని చెప్పాలి?"

"జరిగినయథార్థవిషయమంతా చెబుతేచాలు, కాళింది నిర్బంధం చేయడంవల్ల ను వ్వావిధంగా చేయవలసివచ్చిందనిచెప్పు, మిగతా విషయ మంతా నేను చెబుతా. సావకాశముంటే, నా ప్రియుడయిన సి. ఐ. డి. కి నిన్ను రేపు కోర్టులో కలుపుతాను."

"మన మిద్దరమూ ఏకమై కాళింది అఘాతను చేసిందని చెబుతే ఏమవుతుందీ?"

"అంత కంటే బాగుంటుంది, కాళింది డబ్బుగల యువతి అవడంవల్ల ఆమె ఆస్తి కాశించి, నువ్వామెను ద్వితీయభార్యగా స్వీకరించావనీ సవతిమత్సరం వల్ల ఆదుర్గాగ్యురాలు విమలను విషప్రయోగమును చేత చంపిందనీ, తనపై నేరమును పోగొట్టుకోవడానికి నన్ను విమలగా నిరూపించడానికి ప్రూనుకొంం దనీ చెబుతే, నీపై మోపబడిన కేసు ఆకాళిందితలమీద పడుతుంది. మొదట సి. ఐ. డి. ఇదే విధంగా చెప్పవలసిందని కోరాను కాని, నువ్వాలా చెప్పవేమోనని నేను అనుమానించాను."

"చెప్తా విశాలా! కాళింది చేసిన మోసానికి మన మిప్పుడేం చేసినా పాపం లేదు."

"సరే, అయితే, యీ విషయమునే జ్ఞాపకం పెట్టుకో" అని విశాల అతనిని హెచ్చరిస్తూన్న సమయంలో, మేడమీద పడుకొన్న కాళింది లేచిన అలికిడయింది. అందువల్ల విశాలా కనకరాజు లేమీ యెరుగన ట్లింట్లోకి వెళ్ళిపోయినారు.

## ౧౦

ఆ కేసునుగురించి తెలుసుకోవాలని కుతూహలంగా వున్నవా రందరూ ఆనాడు కోర్టుకు హాజరయినారు. తమ అన్నగారి బిడ్డ అయిన విమలను దుమ్ముపాలు చేసినవాడు కనకరాజనే వుద్దేశ్యంతో అతని గుమ్మం తొక్కడానికి యిష్టంలేని వర్మ రాధమ్మ ఈ కోర్టు వాయిదాకు వచ్చి కూడా, సత్రింలో బసచేసి అక్కడనుంచే యెకాయెకిని కోర్టుకు హాజరయినారు. నేరం యెవరిమీదా లేకుండా కేసు కొట్టివేయ బడుతుందన్న ధైర్యంకొద్దీ కాళింది ఆనాడు మామూలు కంటే యెక్కువగా అలంకరించుకొని కోర్టుకు హాజరయింది. కనకరాజు ముఖంలో కానాడేదో కొత్తకాంతి వచ్చిందన్న విషయమును కాళింది గ్రహించుకొంది కాని, అందుకు గల కారణము తెలుసుకోలేక పోయింది.

సి. ఐ. డి. అయిన మధు తా నాకేసులో కూపీతీయగలిగి నందుకు మార్కు వస్తుందిగదా అని చాలా హెచ్చరికగా వున్నాడు. విశాల తాను కాళిందిని ఉలాసీదా కొట్టించగలుగుతున్నందుకూ, తన అప్పగారిని లోకంలో లేకుండా చేసిన దుర్మార్గురాలిపై కక్షసాధించ గలుగుతూ వున్నందుకూ ఎక్కువ సంతోషంగావుంది. మధ్య మధ్య మధువైపు క్రీగంటి చూపులు చూస్తూ ముసి ముసి నవ్వులు నవ్వుతూవుంది.

న్యాయమూర్తి యింకా ఉచితాసనాన్ని అలంకరించ లేదు. అందువల్ల విశాల మధుకు సంజ్ఞ చేసి, అవతలకు తీసుకెళ్లింది. ఆవు తోనే కనకరాజుకూడా యివతలకు వచ్చాడు.

"నిన్న మన మనుకొన్నవిధంగా గాకుండా కనకరాజు యింకో విధంగా చెప్పి, మనపనిని మరింత సులువు చేయదల్చుకున్నాడు. ఈ విషయమును చెప్పడానికే మిమ్మల్ని యివతలకు పిల్చాను." అని విశాల మధుతో అనగా—

"ఏమని చెబుతారు?" అని మధు ఆదుర్దాగా అడిగిన మీదట

"మీరు మొదట చెప్పినట్లే. కాళింది తానే నిశ్చయంగా విమలకు విషప్రయోగం చేసినట్లుగా చెబుతాడు."

"ఓ! యింకేం కావాలి? మరీమంచిది, ఈ వాయిదాలోనే తీర్పు కూడా చెప్పేస్తారు. స్థితిమంతురాలుగదా అన్న భ్రమవల్ల విమల వుండగానే కాళింది నీతడు ద్వితీయభార్యగా పరిగ్రహించినట్లు, సవతి మత్సరంవల్ల కాళిందే విమలకు విషప్రయోగం చేసిననట్లు కేసు ఋజువు కాగలదు."

"అవును, అలాగే చెబుతానండి" అని కనకరాజన్నాడు.

"మా బాబయ్యతోనూ, పిన్నితోనూ కూడా యథార్థ విషయ మును చెప్పేశాను. నేను విమలను గానసీ, విశాల నయిన మాట నిజ మనీ చెప్పాను. వారుకూడా కాళిందిపై కక్ష సాధించడానికే పూను కున్నారు. వా రిప్పుడు న్యాయాధికారి యెదుట చెప్పవలసిన విధానం కూడా బోధచేశా." అని విశాల తిరిగి మధుతో అంది.

"రైటు. న్యాయమూర్తి కారుమీద వస్తున్నాడు. లోపలకు పదండి" అని మధు హెచ్చరించినమీదట అందరూ లోపలకు వెళ్లి కూర్చున్నారు. కాని, ఎవరో కొత్త యువకునితో, విశాల, కనకరాజు, గుసగుస లాడుతున్న విషయమును కాళింది పసిపట్టింది. అందుచేత న్యాయాధికారి ఉచితపీఠాన్ని అలంకరింపబోయేలోపుగా,

"కనకరాజుతోనూ, నీతోనూ బయట గుసగుస లాడుతున్న ఆ అంద మయిన యువకు డెవ రేమిటి విశాలా?" అని ఆదుర్దాగా అడిగింది.

"అతడే, నా సీక్రెట్ లవర్" అని విశాల పెంకితనంగా జవాబు చెప్పింది. కాళింది నిర్ఘాంత పోయింది. తిరిగి విశాలను ఏమని అడగ డానికీ కూడా వ్యవధి లేకండా న్యాయమూర్తి వచ్చి ఉచిత పీఠము నలంకరించాడు. అందువల్ల, ఆ వాతావరణమంతా నిశ్శబ్దమయింది.

విశాల పెంకితనంగా ఆ జవాబు చెప్పి నప్పటి నుంచీ, కాళిం దికి అకారణంగా గుండెల్లో అదటు బయలు దేరింది. ఆయువకు డెవ రయి వుంటాడా అని పరిపరివిధాల ఆలోచించింది. అతని కా కేసులో ఏమిటి సంబంధమూ అని ఆలోచించింది. కాని ఆమె కేమీ అర్థం గా లేదు.

"నీ కెవరో కాకినాడలో సీక్రెట్ లవర్ వున్నాడు" అనితానామె గురించి అన్నమాటను విశాల అప్పుడు ఎత్తిపొడిచిందా? లేక అతడు నిజంగానే ఆమెకు రహస్యప్రియుడా? కాళింది ఏమీ తెలియక కొట్టుకు పోయింది! విశాల నింకా ఏమయినా అడిగి, ఆయువకుణ్ణిగురించి తెలుసు కొందామా అంటే, కేసు విచారణ ప్రారంభం కావడంవల్ల ఆమె కటువంటి అవకాశం లేకుండా పోయింది.

ఇంతలో, మధు అప్పుడే రాసిన ఒకకాగితమును, కొంతరెకార్డు న్యాయాధికారి యెదుటపెట్టి,

"ఈ కేసులో జామీనుపై విడువబడిన ఒకటవ ముద్దాయి, కనకరాజును, రెండవ ముద్దాయి అయిన కాళిందియును, హాజరు పెట్ట బడినారు. ప్రభుత్వంవారు నాకు నియోగించినప్రకారం, కేసుయొక్క-

కూపీని తీయగా, నేరమంతా రెండవ ముద్దాయి అయిన కాళిందిదే అయినట్లును ఒకటవ ముద్దాయి అయిన కనకరాజు కేవలము నిర్దోషి అయినట్లును తేలింది. కాళింది డబ్బుగలదనే వుద్దేశంతో, కనకరాజు తన మొదటి భార్య అయిన విమల వున్నప్పటికీ కాళిందిని ద్వితీయ భార్యగా స్వీకరించాడు. అయితే సవతియందుండే మత్సరంవల్ల విమలను విషప్రయోగమును గావించి చంపినది కాళింది.'' అని మధు చెబుతూ వుంటే, కాళిందికి తలపై పిడుగు పడ్డట్టయింది. గుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టాయి. అత డా కేసులో నియోగింపబడ్డ సి. ఐ. డి. అని ఆమె అప్పు డర్థం చేసుకుంది. కాని ఆ కేసు అలా అడ్డం తిరిగిం దేమిటా అని ఆశ్చర్యపోతూంది. ఆమె తరపున వకీలున్నా తెల్ల బోతున్నాడు.

మధు తిరిగి ''ఈ కేసులోని విశేష మేమనగా, విమలకు చెల్లె లయిన విశాల అను నామె ఒకతె వుంది. ఆమె మూకు మూర్తులా అక్కగారినే పోలివుంటుంది. ఈ అవకాశమును పురస్కరించుకొని, కాళింది, విశాలకు లంచమిచ్చి, ఆమెయే విమల అనీ, విమల చనిపో లేదనీ నిరూపించదల్చుకుంది. ఇప్పు డా విశాల అన్న యువతి కూడా కోర్టు యెదుట హాజరు పెట్ట బడింది. మరియు, విమలా విశాలలకు పిన తండ్రి, పిన్నమ్మలయిన, వర్మ రాధమ్మ లిద్దరూ కూడా హాజరు పెట్ట బడ్డారు. కనుక కోర్టువారు వారిని విచారించి దాఖలు చేయబడిన రికార్డును చూచి, న్యాయమును తెలుసు కొందురుగాక'' అని చెప్పి ముగించాడు.

కాళిందికి బుర్రలో రైళ్లు పరుగు లెత్తడం మొదలు పెట్టాయి, సముద్రాలు ప్రవహించడం మొదలు పెట్టాయి.

న్యాయాధికారి, అంతకుపూర్వపు వాయిదాలలోవలెనే, ముద్దా యిలను, సాక్షులను పేర్ల వరుసను ఒక్కొక్కరినే పిలిచాడు. అందరూ కోర్టుయెదుట నిలచివుండగా ఆ న్యాయాధికారి సి. ఐ. డి. చేత దాఖలు చేయబడిన రికార్డునంతటినీ ఆమూలంగా చూచిన అనంతరం కాళిందిని ప్రమాణంచేసి, యథార్థమును చెప్పవలసిందిగా కోరాడు.

కాని, అప్పు డామె ఒక్కమాటయైనా చెప్ప లేని పరిస్థితిలో వున్న కారణంవల్ల, ఎవరూ ఏమీ చేయ లేక పోయినారు.

"నీ కేమీ తెలియదని చెప్పు" అని ఆమె తరఫున వకీలు హెచ్చరించి నప్పటికీ, ఆమె మాటలాడ లేకపోయింది. - ఆమాటలనే చెబుదామని, ఆమె ఎంతగానయినా ప్రియత్నం చేసింది. కాని, నాలుక పిడుచగట్టి, ఆమె స్తంభించి పోవడంవల్ల నోట ఒక్కమాటయినా రా లేదు.

అనంతరం, న్యాయమూర్తి కనకరాజును ప్రమాణం చేయించి యథార్థమును చెప్పమనగా, అత డిలా చెప్పాడు.

"సి. ఐ. డి. గారు చెప్పినదంతా యథార్థము. కాళిందిని నేను డబ్బుకాసించి రెండవభార్యగా స్వీకరించాను. ఆమె సవతియాదుండే మత్సరంకొద్దీ నా రెండవభార్యఅయిన విమలకు విషప్రయోగము చేసి, చంపించింది. తరువాత, తనపై మోపబడిన నేరమును తప్పించు కొనే వుద్దేశంతోనాచనిపోయిన భార్యలాగునే వుండే విశాలను, విమల గానే నటింపజేసి, బంధువులకు, కోర్టుకూ కన్నుగప్పాలని చూసింది."

అనంతరం, విశాల "రెండవముద్దాయిఅయిన కాళింది, మా అక్కగారయిన విమలను విషప్రయోగము చేసి చంపించిన కారణం వల్ల ఆ కేసునుంచి తప్పించుకోవాలని నేనే విమలనని బంధువులకు, స్నేహితులకు చెప్పమని కోరింది. ఆమె యీయబోయే డబ్బుకాశపడి, మొదట నే నందుకు నమ్మతించాను కాని, అనంతరం పశ్చాత్తాపపడి, నా సోదరిని ఈ లోకంనుంచి వేరుచేయించిన దుర్మార్గురాలికి తగిన ఫలితము ననుభవింపజేయాలనే ఉద్దేశంతో, నామొదటి అభిప్రాయ మును మార్చుకున్నాను. నేను విశాలనుగాని, విమలను గానని బహి రంగంగా కోర్టువారి సన్నిధిని ప్రమాణంచేసి చెబుతున్నాను." అని నిర్భయంగా చెప్పిన యథార్థవాక్యాల నాలకించిన వా రందరూ నిర్ఘాంత పోయినారు. కాళిందిని వెయ్యినాలుకలతో శపించారు. కాళింది కప్పుడు నిజంగానే మతిభ్రమణ కలిగినట్లుయింది.

తీర్పు చెప్పడానికి న్యాయాధికారి వాయిదా వెయ్యలేదు. "సాక్షులను, ముద్దాయిలను విచారించగా, కాళింది నేరస్తురాలని రుజువు కాబడింది. అయినప్పటికీ ఆమె విమలను విషప్రయోగమును చేస్తుండగా చూశామని యెవరును చెప్పలేదు. కనుక, ఆమెకు ఆరు సంవత్సరాలు కఠిన శిక్షను మాత్రం విధించి, యితర ముద్దాయిలను విడుదల చేయడమయినది.

ఈ కేసులో సి. ఐ. డి. గా పనిచేసిన మిష్టర్ మధుసూదన్ యొక్క నేర్పును,చాకచక్యమును కొనియాడుతూ, అతనికి మార్కును సిఫార్సు చేయడ మయినది." అనిచెప్పి న్యాయాధికారి పీఠము దిగి పోయినాడు.

కాళిందిని పోలీసులు బంధించి తీసికొని పోతూవుండగా, తన సోదరిని శాశ్వతంగా యీ లోకంనుంచి వేరుగావించిన దుర్మార్గురాలి పై విశాల కింక కక్ష తీరలేదు.

"కాళిం దక్కా! నాసీక్రెట్ లవర్ యెవరో నీ కిప్పుడయినా తెలిసిందా? సి. ఐ. డి. మధును నేను పెళ్లి కూడా చేసుకో బోతు న్నాను. ఇప్పుడు నీ యిష్ట మొచ్చినట్లు చేసుకో అనిచెప్పి ఆమె ఆ చేరువలోనే నిలుచున్న, మధుచెయ్యి పట్టుకొంది. అతను చిరునవ్వు ముఖంతో, విశాలను వెంటబెట్టుకొని యివతల కొచ్చాడు. పోలీసుల వెంట గొని పోబడుతున్న కాళింది గుడ్లు రెండూ విడిచి పెట్టి నూరాడసం కంటే, యింకేమీ చెయ్యలేక పోయింది.

"కనక రాజుతో నే నొక్క మాటను చెప్పవలసివుంది, అందు కనుమతించి, తరువాత నన్ను మీ యిష్టమొచ్చినట్లు చెయ్యండి." అని కాళింది కోరిన మీదట, పోలీసు లామె కోరికను నిరాకరించ లేదు. కనకరా జామె దగ్గరగా వెళ్లగా,

"నేను నీకూ నీ భార్యకూ తీరనిద్రోహం చేశాను. అందుకు నా కీ శిక్ష తగినదే. జవహ్రీ, రొఖము, మొదలయిన వన్నీ, ఇనప్పె ట్టెలో వున్నాయి. ఇదిగో దాని తాళాలు. నీయిష్ట మొచ్చినట్లు

వినియోగించుకో బ్రతికి బాగుండి, నేను జైలునుంచి బయటపడితే, అప్పుడు నీ దయా ధర్మములకు పాత్రురాల నవుతాను'' అనిచెప్పి కాళింది అందించిన తాళపు చెవులను కనకరాజు హూనంతో అందుకున్నాడు.

“బావా! గుడ్ బై! వెళ్ళివస్తా. బాబాయ్, పిన్నీ! ఈతను నాకు సీక్రెట్ లవర్, అని కాళింది పేరుపెట్టింది. ఇతన్నే నేను పెళ్లి కూడా చేసుకోబోతున్నాను. మీరందరూ ఆశీర్వదించండి''అని విశాల మధు చేతిలో తనచేయి నుంచగా, అక్కడున్న వారందరూ ఆమె నాశీర్వదించారు.''

స మా ప్త ము



## పీరమతి

గ్రంథకర్త - పానుగంటి

పానుగంటివారి ప్రతిభావిశేషాలకు పట్టుతలపాగ, హాస్యరసార్ణవాన్ని తరచి తరచి పొందిన అమృతాక్షర స్వరూపం, ఆధునికాంధ్ర సమాజంలో అందందుపొడచూపే అత్యాచారాలను అపహాస్యంగాకన బడకుండా అయ్యలనూ, అమ్మలనూఅల్లరిపాల్జేసినఅసదృశమగునాటకం

ఒక రాజు కిద్దరు భార్యలు. లోకాచారప్రకారం చిన్నరాణి చెంగు చెంగున క్షితీశ్వరుని గుండెల్లో చిందులేయ సాగింది, నోట్లో నాలుక లేదు, పలుకుల్లో కరకుదనం లేదు, అంట్లూనే మొగుడినెత్తిమీద మొట్టుతూ సవతిసంసారానికి చన్నీళ్లుతోడి, యువరాజైనసవతికొడుక్కి-ఉరిశిక్ష వేయించాలని ఉబలాటపడి, చవిటి దద్దమ్మఅయినతన కొడుక్కి-సామ్రాజ్యాన్ని కట్టిపెట్టాలని తహతహలాడి అనేకమైన అవకతవకలు చేసిన అమ్మగారి హాస్యరసపూరితమైన జీవితగాథ, యిది.

సపతుల సంసార సౌఖ్యాన్ని సంపూర్ణంగా చిత్రించ కలిగారు. ఇందులోని భావనూ, భావలోవి హాస్యాన్ని విశేషించి చెప్పడం సూర్యుడ్ని చూపడానికి కాగడా యెత్తడం. వెల రు 1-4-0.

## ముద్రిక

గ్రంథకర్త - పానుగంటి

మొగుడికి ముండలమీదమోజు, భార్యకు పాతివ్రత్యం అంటే ప్రాణం! చేతులో సిరి చిందులేస్తోంది, ఆజ్ఞకు లోకం అదలిపోతోంది, క్షణక్షణపరివర్తన పొందేఅతనిభోగలాలసత్వంక్రిందయెన్నితాలిబొట్లో తగలడిపోయినై, ఎన్ని సంసారాలో మన్నైపోయినై, తుద కాతనికి కామపిశాచానికి బలిగా ఒక సుక్షత్రియ కన్నె బలాత్కారంగా తేబడ్డది ఆమెనే మహారాణిగా చెయ్యాలనిఆమహారాజుతొందరపడ్డాడు.అవన్నీ చూసి చూసి, అతని భార్యలోవున్న సహనం కాస్త చచ్చిపోయింది. మెత్తమెత్తగా చెవి మెలేసే ఓదాసికన్నెను ఆమె చేరదీసింది. అక్కడ నుంచి కథ ప్రారంభమైనది.

వలపు పలుకులతో, పలుకు కులుకులలో, కులుకుములుకులతో ఆదాసి రాజుగారి వలపుచెలికాని లొంగించుకుని, బుగ్గపోట్లతో నాటకం అంతా నడిపింది, ముసిముసినవ్వులతో రాజుగారి ముద్రిక నపహరించి, ఆయన్ని బంధించి సార్వభౌముని కౌగిట్లో క్షత్రియకన్నెచిక్కుకోకుండా విడిపించి రాణి కంటినుంచి రత్నాలు కురిపించింది. వెల రు. 1-0-0

వలయువారు: నరస్వతీ బుక్ డిపో, బెజవాడ.